అనంతలక్ష్మి కంబైన్స్

# ఈ కాలపు పిల్లలు




సోల్ డిస్ట్రిబ్యూటర్స్: అన్నపూర్ణ పిక్చర్స్ అన్నపూర్ణ ఫిలింస్ లిమిటెడ్ alpana

# వెలను పరిశీలించండి.
# గుణమును పరీక్షించండి.

## పాయింట్

అతి నాణ్యమైన బట్టల సబ్బుపొడి




వెల పట్టి

పన్నులు చోటునుంచి చోటుకి వ్యత్యాసం ఉండుగనుక ప్యాకిమీద చూపబడిన వెలకు పన్నులను చేర్చలేదు. హైదరాబాదులో అమ్మేడు వెలలను (పన్నులు చేర్చి) ఈ క్రింద ఇవ్వబడినవి—శ్రేష్ఠమైన సబ్బు పొడిలతో పోల్చగల పాయింట్ అప్పటికి తక్కువ ధర గలది.

| పాయింట్ | 750 గ్రాం | 550 గ్రాం | 200 gm |
|---|---|---|---|
| ప్యాక్ వెల (పన్నులు లేక) | 8.90 | 6.80 | 2.63 |
| మీరు ఆఖరుగా ఈయవలసిన వెల (పన్నులు చేర్చి) | 9.33 | 7.13 | 2.76 |



గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరి,
బెంగుళూరువారి ఒక శ్రేష్ఠమైన ఉత్పత్తి

లోకంపోకడ — ఈమని





# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 16–4–'76

నలనామ సం. చైత్ర బ. విదియ

**సంపుటము : 69 సంచిక : 32**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు. 33–80

ఆరుమాసాల చందా – రు. 16–90

విడి ప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :

'జ్యోతి'లో జయసుధ, మురళీమోహన్

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

# మన లో మాట

## ○ పరిధి ○ మైనస్ బ్రతుకులు ○ మిణుగురులు ○ రాదారిపడవ

ఇదీ దీపావళి చిన్న సీరియల్ కథలను పాఠకులు ఎన్నికచేసిన వరుస పాఠకుల నిర్ణయానుసారం ప్రథమస్థానం చూరగొన్న శ్రీ కవనశర్మగారికి రు.600లు, ద్వితీయ స్థానాన్ని అందుకున్న శ్రీ యస్ యస్ లాల్‌గారికి రు 500లు, తృతీయ స్థానాన్ని పొందిన శ్రీ "శ్రీసింధు" గారికి రు 400లు, శ్రీమతి ఉమాదేవిగారికి రు 300లు చొప్పున అదనపు బహుమతులను అందజేస్తాము

కథలపై బ్యాలట్‌తో పాటు వ్యాస రచన పోటీకూడా నిర్వహించాముకదా! విశాఖపట్నంనుంచి పాఠకుడు శ్రీ కె.వి వి బ్రహ్మానందరావుగారు పంపిన వ్యాసానికి ప్రథమ బహుమతి రు 250లు, సింద్రీ (బీహార్) నుంచి శ్రీ జంపని రామమోహనరావుగారు పంపిన వ్యాసానికి ద్వితియబహుమతి రు 150లు, తెనాలినుంచి కుమారి జె. వెంకటలక్ష్మిగారు పంపిన వ్యాసానికి తృతీయ బహుమతి రు 100లు పంపుతున్నాము. ఎన్నుకున్న వ్యాసాలు మూడింటిని యీ సంచికలోనే వేస్తున్నాము

బ్యాలట్ విజేతలకు, వ్యాస రచన పోటీలో విజేతలైన పై ముగ్గురి పాఠకులకు, బ్యాలట్‌లో పాల్గొన్న రచయితలు, పాఠకులందరికీ కూడా యీ సందర్భంలో మా శుభాకాంక్ష లందజేస్తున్నాము.

# ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

ఉగాది ప్రత్యేక సంచిక ముఖచిత్రము చాలా బాగున్నది ఉగాది పాట ఉగాది కార్టూనులు విశేషించి బాగుండాయి

ఎన్ భాగ్యవాణి, (అల్లవరం.)

*   *   *

ఉగాది సంచిక ఎంత ముగ్ధులను చేసిందో అంత నిరుత్సాహపరచింది ఎందుకంటే సినిమా బ్యాలెట ఫలితాల అలస్యానికి

యన్ మనోహర్, అనంతపూర్

### ఉత్తరాలు

నేను పత్రికను పది సంవత్సరములనుండ, చదువుతున్నాను చదివిన తరువాత నా అభిప్రాయమును ఉత్తరాలద్వారా నచ్చితే నచ్చాయని, నచ్చకపోతే నచ్చలేదని విమర్శిస్తూ వ్రాసాను. కాని ఎన్ని ఉత్తరాలు వ్రాసినను నా ఉత్తరం ఇంతవరకూ ప్రచురింపబడలేదు

బాగున్నాయని వ్రాసినా, నచ్చలేదు అని వ్రాసినా ప్రచురించకపోతే మరి ఏవిధంగా వ్రాస్తే మా ఉత్తరాలు ప్రచురిస్తారు ? ఉత్తరాలు ప్రచురించడానికి "రేటు"ను గాని నిర్ణయించారా? విమర్శకులకు చోటులేని ఉత్తరాల శీర్షిక మీ పత్రికలో ఎత్తివేయండి నా యీ లేఖ ప్రచురిస్తారని ఆశిస్తాను

గిరుగురామం (బొబ్బిలి)

### సినిమా

"మంచి సినిమాలు రావాలి" అని "నేటి సినిమాలు కుటుంబముతో చూడలేము" అని యువతరం శీర్షికలో ప్రతివారు వ్రాస్తున్నారు ఈ నాటి రోజులలో అసభ్యకరమైన పాటలు, నృత్యాలు, ద్వంద్వార్థము వచ్చేమాటలుగల సినిమాలు వచ్చుచున్నవి నిజమే కాని వీటినే ప్రేక్షకులు ఎక్కువమంది చూచుటవలన అధిక కలక్షన్‌లు వచ్చుచున్నవి యువతరం శీర్షికలో అందరు మాటలు చెప్పుచున్నారుగాని చేతలలో చూపుటలేదు ఇలాంటి సినిమాలకు అధిక కలక్షన్‌లు వచ్చుచున్నవి కాబట్టి నిర్మాతలు అలాంటి సినిమాలే తీయుచున్నారు ప్రేక్షకులు ఆదరిస్తున్నారు కావున మేము కూడ అదే సినిమాలు తీస్తాము అంటున్నారు నిర్మాతలు ఇలాంటి అసహ్యకరమైన సినిమాలే శతదినోత్సవములు, రజతోత్సవములు జరుపుకుంటున్నాయి మంచి సినిమాలు సరిగా ఆడుటలేదు అలాంటి సినిమాలు చూడకపోతే నిర్మాతలు అలాంటి సినిమాలు తీయటం మానివేస్తారు. ఇప్పటికైన మాటలు కట్టిపెట్టి చేతలలో చూపండి నిర్మాతలదేం తప్పలేదు నాటికి నూరు పాళ్ళ ప్రేక్షకులదే,

ప్రతాప్ కుమార్, (రాజమండ్రి)

### కథలు

ఉగాది సంచికలో ప్రచురించిన 'విచిత్రం కాని కథ' చాలా బాగుంది అభినేతి ఒయ్యారపద ప్రేక్షకులతో సంభాషించిన తీరు చాలా బాగుంది

ఎస్. కె. జ్ఞానదేవ్, (పూడిమడక)

*   *   *

"నటి స్నేహలత" ముఖచిత్రంముఖచిత్రంతో వెలువడ్డ (26 3 76) పత్రిక అత్యంతాకర్షణీయంగా ఉంది. పోతే కథలలో "ఇది కూడా ఒక కథే" మాకు చాలా నచ్చింది

అరువపల్లి లక్ష్మీరాజం, బేబీలత (కమాన్‌పూర్)

*   *   *

ఆనందానికి మారు పేరే ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఇందు ప్రచురిస్తున్న ప్రతి శీర్షికా నన్నేకాదు, అందరి హృదయాలని కదిలించి, అమితానందమును కలిగిస్తుందనేది నమ్మకం. పత్రిక విడుదలయ్యేరోజు ఒక పర్వదినము వలె భావించి చెంది, నిద్రాహారములను కూడా లెక్క చేయక శీర్షికలన్నీ ఆ రోజే పూర్తి చేసేస్తాను నా జీవిత భాగస్వామ్యురాలు కాబోయే దానినైనా ఇంతగా ప్రేమిస్తానన్న నమ్మకము నాకు లేదు.

యు. వి భాస్కర్, విజయనగరం—3

*   *   *

26 3 76వ తేదీ పత్రికలో ముఖచిత్రం (స్నేహలత) ఏమంతా ఆకర్షణీయంగ లేదు. కథలలో "ఇది కూడా ఒక కథ" ఒక మెస్తరుగా ఉంది "డబ్బు ఎంత నిగ్రహపరుస్తుందో" బలహీనుడిగా, అతి దుర్బలహృదయుడిగ కొందరిలో మార్చేస్తుంది అన్న నగ్నసత్యం ఎంతో... "యకం" కథతో నాటికి నూరు పాళ్ళ వాస్తవమే! రాజారాం కుటుంబం పట్ల చూపించిన ఔదార్యం "సహాయం" ఎంతైనా మెచ్చుకోదగినది సీరియల్స్ చదువుతున్నకొద్దీ ఉత్కంఠ పెరుగుతూంది మీ (మా) పత్రిక, వినోదానికీ విజ్ఞానానికీ, కాలక్షేపానికి (ప్రవాసాంధ్రులకు కూడా) చాలా చాలా ఉపయోగపడతోంది అని చెప్పటానికి గర్విస్తున్నాను.

పతి గోపాలకృష్ణ నాయక్,
(బర్హంపూర్ ఒరిస్సా)

### సామాన్యుని సణుగుడు

ఈ వారం 26 3 76 నాటి పత్రిక చాలా బాగుంది ముఖచిత్రం ఏమంత బాగోలేదు సామాన్యుని సణుగుడు శీర్షికలో ప్యాసింజర్ల ఇక్కట్లు చాలా బాగా తెలియజేశారు 'కాలమిచ్చిన తీర్పు' చాలా బాగుంటున్నది

అక్కరాజు రఘునాథ్ అక్కరాజు ప్రఫుల్ల చంద్ర, (ధర్మవరం)

## దీపావళి కథలపై వ్యాసరచన పోటీ

## ప్రథమ బహుమతి రు. 250 లు పొందిన వ్యాసం. కె.వి.వి. బ్రహ్మానందరావు

దీపావళి కథల పోటీలో ప్రచురించిన నాలుగు కథలు వస్తు వైవిధ్యంగలవి. అన్ని కథలు సామాజిక జీవితాన్ని ప్రతిబింబించాయి. కథా కథనంలో నవ్యత ఉంది

మొదటిదిగా **మైనస్ బ్రతుకులు** చూస్తే కథలో మురళిది మైనస్ బ్రతుకు గొప్పవాడు ప్లస్ అయితే అతడి ప్రాభవంలో బ్రతికే పేదవాళ్ల బ్రతుకులు ఎప్పుడూ మైనస్‌గానే ఉంటాయి అని నిరూపించిన కథ యిది ఊళ్లో హరిబాబుది పై చేయి ఆ చేతికి బయిపడి చేదులాంటి శ్యామలమ్మ హత్యా నిజాన్ని చిన్నవయస్సులో మింగేస్తాడు ప్రాభవం పలుకుబడి ఉన్నవాడికోసం అబద్ధం చెపితే నలుగురూ నమ్ముతారు అదేనిజాన్ని దిక్కులేని మనిషి తరపున చెపితే నమ్మరు సరికదా పైగా చెప్పినవాడి మీదకె తోస్తారు. పితాలు విషయంలో మురళికి యిదే జరిగింది మురళి జీవితం జాలిగా ముగుస్తుంది. మంచి బిగువుతో సాగిన కథ యిది.

**పరిధి** • యితివృత్తం ఆలోచనలు అభిప్రాయ మున్న మనుష్యుల చుట్టూ అల్లిన కథ మనిషి ఏర్పరుచుకున్న పరిధి ఆ మనిషికే పరిమితంగాని ఆ పరిధిలో మరో మనిషి యిమడడానికి చోటు ఉండదు ఒక వేళ 'నావాళ్ళు' అనుకునే పరిధి ఉన్నా మనిషిలో స్వార్థం పెరిగితే 'నేను—నా పరిధి' మిగులుతుంది. అందుచేత సింహం పాతిక సంవత్సరాల సుభద్ర సాహచర్యాన్ని పాత చొక్కా విప్పినట్లు విప్పేయగలుగుదాడు కన్నతల్లిని, కట్టుకున్న భర్తను కెనడాకు అప్పజెప్పి సొంత వాళ్ళ వోదార్పు కోసం సుభద్ర స్వదేశం పరిగెట్టుకు వస్తుంది కథలో రఘు, లక్ష్మి పాత్రలు ఉన్నతంగా కనిపిస్తాయి' కమ్మని శైలి, చురుకైన సంభాషణలలో సాఫీగా సాగిన కథ యిది.

వాస్తవికత ఉన్న మూడవ కథ **మిణుగురులు** మధ్య తరగతి మనుష్యుల జీవితాలకు అద్దం పట్టింది చెదిరిన ఆశలలో, చితికిపోయిన జీవితాలలో ప్రభాకరం, ప్రకాశం, ప్రభావతి లక్ష్మలాది నిరుద్యోగులకు ప్రతినిధులుగా కనిపిస్తారు సాధారణ కుటుంబాలలో సంపాదించే మనిషి కరువు అయితే ఎంత దుర్భరమో ప్రభాకరం కుటుంబం చూసినప్పుడు అర్థమవుతుంది ఏకాకిగా మిగిలిన ప్రకాశం పట్ల జాలి కల్గుతుంది. అదృష్టం కలిసి అందరి జీవితాలు చక్కబడలాయి నిరాశ, నిస్పృహలతో బ్రతుకు చీకటిగా అనిపించినా అనుకోకుండా వచ్చే అవకాశాలు, ఆనందం ఆ చీకటిలో మిణుగురులా మెరుస్తాయి అని చెప్పారు రచయిత

ఇక చివరి కథ **రాదారి పడవ** యితివృత్తం మార్పును కోరేది సంఘంలో కొన్ని ఆధారాలకు నమ్మకాలకు బలి అయిపోయి బ్రతుకును నరకం చేసుకునే యువతీ యువకులకు మార్గం చూపే కథ యిది. కథలో రచయిత సుబ్బారావు చాలా ఆదర్శంగా కనిపిస్తాడు అయినప్పటికి సుబ్బారావు యిద్దరు భార్యలను కోరుకున్న వ్యక్తులతో కలిపినట్లు ఎంత మంది చేయగలరు! అనేది ప్రశ్న !! అతని ఆదర్శం, మనస్తత్వం చూసి 'వసుధ' అనె మైనారిటి తీరని అమ్మాయి రక్షణ కోరుతుంది సుబ్బారావుకు జీవితంలో మిగిలింది ఏమిటో అర్థంకాదు కేవలం ప్రయాణికులను ఒకతీరంనుండి యింకోతీరం చేర్చే 'రాదారి పడవ' లాంటి జీవితం సుబ్బారావుది అయితే ఈ కథలో వాస్తవికత రేదేమో అనిపిస్తుంది.

---

## ద్వితీయ బహుమతి రు.150లు పొందిన వ్యాసం

## —జంపని రామమోహనరావు

**మైనస్ బ్రతుకులు :** "ప్రాభవం పలుకుబడీ వున్న హరిబాబు కోసం ఒకప్పుడు మురళి అబద్ధపు సాక్ష్యం చెబితే అందరూ నమ్మతారు హరిబాబును ఒక ఎద్దు పొడిచి చంపటం మురళి చూస్తాడు ఆ నేరం ఒక అమాయకురాలిపై పడుతుంది. ఆమెను కాపాడాలని తను చూచిన నిజం అందరికీ (పోలీసులతో సహా) చెప్తాడు మురళి. కానీ, ఎవ్వరూ నమ్మరు!"

ఈ దేశంలో 'జనం' అనేక విషయాల్లో తమను కొట్టే చేతినే సమర్థిస్తుండటానికి కారణం, జీవనోపాధికి ఆ కొట్టే చేతినే ఆశ్రయించవలసిరావటం మంత్రులూ, ఉపమంత్రులూ, వగైరా పెద్దలున్న సభలో కొందరు పెద్దలు మురళిపై కోపం ప్రదర్శించగానే, ఆ పెద్దలతో అవసరాలుండటం వల్ల 'జనం' కూడా మురళిమీద విరుచుకు పడి యి అన్యాయాన్ని మొద్దుల్లా సహిస్తూ ఊరుకోవటమే జనంలోవున్న తప్పు 'జనం' ప్రవర్తనను తీవ్రంగా విమర్శిస్తుంది కథ.

**రాదారి పడవ :** సుబ్బారావు ఆదర్శాలున్న రచయిత భార్య మరొకరితో సంబంధం పెట్టుకున్నదని తెలిసి, విడాకులిచ్చి వాళ్లిద్దరికీ పెళ్లి చేస్తాడు 'కుసుమ'ను పెళ్లాడి ఆమె అంతకు ముందే ప్రభాకర్‌కి మనసిచ్చిందని వాళ్లిద్దర్నీ కలుపుతాడు వసుధకు కొద్ది నెలలపాటు నామమాత్రపు భర్తగా వుండి, పిదప ఆమెను విక్టర్‌తో వివాహం జరపడానికి అంగీకరించి ఆమె సమస్యనూ పరిష్కరిస్తాడు."

స్త్రీ, పురుషుల దాంపత్య జీవితాన్ని గురించి, పెళ్లి విషయంలో పిల్లలకు స్వేచ్ఛనివ్వని పెద్దలను గురించి ఆలోచించదగ్గ విషయాలను ఎత్తిచూపారు రచయిత

**పరిధి :** "బంధుత్వాలకు పరుధులు ఏర్పడుతుంది అన్నపూర్ణమ్మ ఆమె సంతానం నరసింగరావ్, లక్ష్మిలు తల్లి భావాలనే పునికి పుచ్చుకుని ఎదుగుతారు, ఆప్తులను దూరం చేసుకోవటమనేది నరసింహంకు బాధను కలిగించదు ఆ పాషాణ హృదయంలోనే చివరికి తల్లినీ, భార్యనూ, బావమర్దినీ, చెల్లెల్నీ, అందరినీ దూరం చేసుకుంటాడు.

తీసుకున్న ఇతివృత్తానికి తగినట్లుగా కథను నడపలేదేమో ననిపించింది కథలో నరసింహం తనవాళ్లకు దూరం కావటానికి కారణం కేవలం అతని హృదయంలోని సంకుచితత్వమే కాకుండా, కెనడా వెళ్లే అవకాశం రావటం, అక్కడి జీవనవిధానం గూడా కారణాలే ననిపిస్తాయి.

## తృతీయ బహుమతి
## రు 100 లు పొందిన
## వ్యాసం

— జొన్నలగడ్డ వెంకటలక్ష్మి

*రాదారి పడవ :* 'విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ మనిషిలోని భావాలలో అభ్యుదయంగా మార్పు తప్పక వస్తున్నది'- అనటానికే ఈ కథ ఆధారం అసలు వ్యక్తి జీవితమే రాదారి పడవ. ఈ జీవితపు నావ పయనిస్తున్న దారిలో ఎంతో మంది ఎక్కుతుంటారు, దిగిపోతుంటారు అయితే ఇంత మందిలో మనతో చివరిదాకా ఎవరు పయనిస్తారో, వారికీ, మనకీ ఉన్న అవినాభావ సంబంధమే 'వివాహ బంధం', 'మనుగడ' అన్నారు. మరి మనసులేని మనుగడ శాశ్వతనూ? దానిని 'వివాహం' అంటారా? అందుకే ఈ కథలో ముఖ్య పాత్రద్వారా నూతన భావాలు క్రొత్త పంథాలో గోచరమైనవి. సమాజంలో అసంతృప్తిగా గడుపుతున్న సంసారాల్లోని యథార్థ సమస్యను ధైర్యంగా, సహజరచనా శైలితో, పాత్రల మానసిక వర్ణనలో, భావ మిళితమైన కథా రూపకల్పనతో, సార్థక నామధేయంతో నూతన

(31వ పేజీ చూడండి)

*మిణుగురులు :* "ప్రభాకరం, ప్రకాశం, ప్రభావతి, మూర్తి— ఈ నలుగురూ నిరుద్యోగులు దిన దినమూ ఎదురయ్యే అనేక రకాల సమస్యలను ధైర్యంగా ఎదుర్కొంటూ భవిష్యత్తుమీద ఆశలు నిలుపుకుంటారు వయసు దాటిన మూర్తి పిచ్చివాడవుతాడు. మిగిలిన ముగ్గురికీ చివరికి మంచి రోజులు వస్తాయి!"

ఆప్టిమిజాన్ని ఉద్బోధించే ఈ కథా వస్తువు శ్లాఘనీయం. కష్టాలు వచ్చాయని ఎవ్వరూ 'డీలా' పడిపోకూడదు 'రేపు' మంచి జరుగుతుందనే ఆశతో 'సెటి'ని ఎదుర్కోవాలి, కథలో కొన్ని లోపాలు కనిపించాయి. రైలు ప్రమాదంలో మృతులైన వారి కుటుంబాలకు రూ 50 వేలు (ఈ మధ్య లక్ష చేసినట్లు గుర్తు) ఇస్తుంది రైల్వే డిపార్ట్‌మెంట్ ఆ విషయాన్ని పూర్తిగా విస్మరించారు రచయిత, ★




**రిక్షాదిగిన శ్రీలక్ష్మి ఇంటికి వేసిన తాళంచూసి ఆశ్చర్యపోయింది. ఆవేళ ఆదివారం. భర్తకు ఆఫీసు లేదు.**

ఆఫీసు వున్నరోజైనా వెళ్లే టైం కాలేదు. ఆలోచిస్తూనే పక్కింటి పద్మావతిని అడిగింది. "మావారెక్కడికి వెళ్లారూ?" అని.

"తెలిదండీ! పొద్దున్నే వెళ్తూ యింటి తాళం ఇచ్చి వెళ్లారు, ఇదుగో!" అంటూ తాళంచెవి తెచ్చి ఇచ్చింది.

"అనుకున్నంతా అయింది. నేను ఇంట్లో లేనుగదా! ఇష్టంవచ్చినట్లు తిరుగుతున్నారు కాబోలు..." అనుకుంటు తాళంతీసి సూట్‌కేసు తీసుకుని లోపలకు వెళ్లింది. ఇల్లంతా నానా గలీజుగాను వున్నది. కుర్చీలన్నీ చిందర వందరగా వున్నాయి. అక్కడక్కడ ఎప్పుడో తాగి పడేసిన కాఫీగ్లాసులు, ఎక్కడపడితే అక్కడ పుస్తకాలు అందులోనూ ఇంగ్లీషు నవలలు

"ఇవన్నీ ఎట్లా బాగుచెయ్యాలిరా భగవంతుడా" అనుకుంటూ శ్రీలక్ష్మి చీపురు తియ్యబోతుంటే

"దండాలమ్మగారూ!" అని చేతులు నలుపుకుంటూ వచ్చాడు బంట్రోతు

"అమ్మయ్య!" అనుకుని, "నేను వచ్చినట్లు నీకెలా తెలిసింది?" అన్నది

"మీరు రిచ్చా దిగటం చూశానమ్మా! కొట్టుకాడనుంచి తెస్తున్న మానెబుడ్డి ఇంటికాడపడేసి పరిగెత్తుకొచ్చా!" అన్నాడు ముసలి బంట్రోతు వీరయ్య

"మంచిపనిచేశావు కాస్త కాఫీ తీసుకొచ్చిపెట్టు!" అని డబ్బులు, ఫ్లాస్కు యిచ్చి పంపించి, చిందరవందరగా వున్న పుస్తకాలు సర్దబోతుంటే, పక్కింటి పద్మావతివచ్చింది చేతిలో పుస్తకాలు క్రింద పడేసి,

"రండి పద్మావతిగారూ! రండి – రండి" అంటూ ఆహ్వానించింది శ్రీలక్ష్మి

"ముందు మీరీ కాఫీ తాగండి, పాపం! మీకు పొద్దున్నే పాలు రావటంలేదుగా! మీరు ఊరుకి వెళ్లినప్పటినుంచి అన్నయ్యగారికి కాఫీ తాగటానికికూడా తీరిక లేదంటే నమ్మండి నాలుగుమూల్లా తెల్లవారకుండానే వెళ్లి, రాత్రి ఎప్పుడో పొద్దుపోయింతర్వాత వస్తున్నారు. మీరు ఊళ్లో ఉంటే యేవేళకు ఏం కావాలో శ్రద్ధగా చూస్తారు! వస్తా! పని వేళా.." అంటూ ఖాళీ గాసు తీసుకుని వెళ్లిపోయింది

పద్మావతి వెళ్లినవైపే చూస్తు కూర్చున్న శ్రీలక్ష్మి "కాఫీ ఇదుగోనమ్మా!" అన్న వీరన్న మాటతో ఈ లోకంలోకి వచ్చి, "అక్కడపెట్టి ముందు ఇల్లు శుభ్రంచెయ్యి" అన్నది.

వీరన్న నాలుగు మూల్లా ఇల్లు బాగు చెయ్యకుండానే మరో బంట్రోతు రాములు వచ్చాడు. వస్తూనే, "అమ్మగారూ! కూరలు అవీ.." అడిగాడు.

"తరవాత చూద్దాంలే! ముందు ఇల్లు బాగుచెయ్యండి" ఆరోజు పేపరుచూస్తు అన్నది

"అమ్మగారూ!"

"ఏమిటి?" పేపర్లో నుంచి తలెత్తకుండానే అన్నది శ్రీలక్ష్మి.

"సీసాలమ్మగారూ!"

"సీసాలా? ఏం సీసాలు..." గుండె ఝల్లు మన్నది

"ఏమోనమ్మా బుట్టపైనున్న కాయి తాలు తియ్యకుండానే లన్నాడు

"ఏమిటో చూడు" అనబోయి, ఏదో అనుమానంవచ్చి, వద్దులే! అక్కడ వుంచు" లన్నది ఆమాట అన్నదేగాని బుట్టలోవున్న సిసాలేమిటో చూద్దామని ఆదుర్దాగా వున్నది శ్రీలక్ష్మికి మళ్ళాఏదో సంకోచం

"ఏంసీసాలో ఏమో! ఎదురుగా పని వాళ్ళు...వాళ్ళు చూస్తే!"

'లమ్మగారూ! ఎంటచేస్తారా? కారేజీ...' అడిగాడు వీరన్న

ఆలోచిస్తున్న శ్రీలక్ష్మి, "నా రిప్పలేనో నేను పడతాను మీపని కానివ్వండి" లన్నది విసుగ్గా. వాళ్ళను పంపించి ఆబుట్టలోవి ఏం సిసాలో చూద్దామని ఆమె మనసు ఆరాట పడుతున్నది. "అమ్మో! అమ్మో! సీసాల్లు... ఏంసిసాలు తను ఊరివెళ్ళిన ఈ పదిరోజు ల్లోను ఇన్ని ఎందుసీసాలెందుకు వాడారూ? అన్ని మందుసిసాలు వాడారంటే ఎంతజబ్బు చేసివుండాలి అంతవస్తే చెప్తే తనకు తెలియ ఎచ్చిరూ! కాదు... ఆపి హార్లిక్సు సీసాలు అయివుండాలి. అమ్మో? అన్ని హార్లిక్సు సిసాలే! ఎంతడబ్బుపెట్టి కొన్నారో! పిల్లలు, తను, నేను రేపటినుంచి కాఫీమానేసి రెండు పూటా హార్లిక్సు తాగితే మంచిది లేకపోతే గిడ్డకట్టి పాడయిపోదూ! కాదు... అంతడబ్బుపెట్టి అన్ని సీసాలు ఒక్కసారి ఎవరూ కొనరు. బహుశా ఖాళీ సిసాలు అయి వుంటాయి. ఏమైనా పాస మూతపెట్టుకోడానికి బాగుంటాయని కొని వుంటారు." ఆలోచనలో అక్షరం ముందుకు జరక్క చేతిలో పేపరు క్రిందపడేసి విసురుగా లేచింది కుర్చీలోంచి మూల పెద్దబుట్ట అందులో ఏమున్నాయో ఏమో తెలీకుండా పైన పాతగుడ్డలు, ఎప్పుడు కాయితాలు

"పోని తీసిచూస్తే." అందులో ఏమున్నాయో ఏమో ఎదురుగా పనివాళ్ళు. హార్లిక్సు సీసాలయితే పర్వాలేదు. ఈ మధ్య ఎవరింట్లో చూసినా, ఏ నోట విన్నా ...అదే పాపం శమించుగాక. అవేమిటో! వాటి పేర్లు కూడా తనకి రావు. బ్రాందీ, విస్కీ, స్కాచ్, బీర్! ఏమేమిటో వాళ్ళ స్వదేశంవి, మరికొన్ని విదేశాలవట. ఈ మధ్య పత్రికల్లో వ్యాసాలు, అందమైన బీరు బాటిల్స్‌తో రక రకాల ఫ్లవర్ వేజ్‌లు, అధునాతనమైన అణా ఖర్చు లేని టేబిలు లైట్లు, చిన్న సైజు విస్కీ బాటిల్స్‌తో అందాలు చిందే పాపాయిల బొమ్మలు. అబ్బబ్బ! అంటే ఆయన కూడా ఛా..ఛా...అలాంటి పని ఎప్పుడూ చెయ్యరు. ఒకవేళ ఎప్పుడన్నా స్నేహితులతో ... ఏమో ... నాకెందుకు? అసలయినా అలాంటివి కొన్ని చూసి చూడనట్టుండాలి."

"అమ్మగారూ! అన్నీ సర్దేశామండీ! సీసాల బుట్ట." నసిగాడు రాములు.

"ఆ మూలే వుంచు.. అదే పెద్ద లోపల పెట్టు... కాదు కాదు అక్కడే వుండనీ.." ఎటూ చెప్పలేకపోతున్నది శ్రీ లక్ష్మి

"అమ్మగారూ నీళ్ళు తోడానండి!" వీరయ్య తొందర పెట్టాడు. త్వరగా స్నానం చేసి, వీళ్ళ పని కానిచ్చి పంపించి, ముందు ఆ సిసాలేమిటో చూడాలి" అనుకుని గబగబ బాత్‌రూంలోకి వెళ్ళింది ఒళ్ళు రుద్దుకుని స్నానం చేస్తుండగా సుడిగాలి లాంటి ఆలో చన మెదిలింది మనసులో. ఇందాక ఎక్కింటి పద్మావతి వచ్చి ఆయన పొద్దస్తే వెళ్ళిపోతు న్నారని. మళ్ళీ రాత్రి ఎప్పటికోగాని ఇంటికి రావటంలేదని లన్నది. నేను లేనుగదా అని స్నేహితులతో తిరిగితే వాళ్ళే అలవాటు చేసుం టారు. ఆ అలవాటు తప్పించుకోలేక వాళ్ళ దగ్గర ఎక్కువగా తాగితే ప్రిస్టేజ్‌కి భంగ మని ఇంట్లోనే మొదలుపెట్టి వుంటారు.. అవునూ .. అవన్నీ పద్మావతికెందుకు ఆయన ఇంట్లో నుంచి ఎప్పుడు వెళ్తున్నదీ మళ్ళా ఎప్పుడు వస్తున్నదీ ఆరాగా చూడాల్సి, పని పద్మావతికేమిటి? ... అంటే ఇందులో పద్మావతి పాత్ర కూడా వున్నదా? ఏమో . .మగువ...మద్యం, రెండు ఒకదాని కొకటి అంకెట. ఆ! అయినా నాకెం తెలుసు పాపం! పద్మావతి మంచిదేనే!

"తమరి కోసం ఎవరో వచ్చారమ్మా!" వీరన్న మాటలో ఈ లోకంలోకి వచ్చి శ్రీలక్ష్మి మొహం రుద్దుకోటం మర్చిపోయి రెండు చెంబులు నీళ్ళు ఒంటిమీద పోసుకుని వచ్చి, పాతచీర కట్టుకుని, లల పైపైన దువ్వుకుని, మొహాన కాస్త కుంకం పెట్టు కుని హాల్లోకి వెళ్ళింది. ఎదురుగా అపరిచిత వ్యక్తి, అయిదడుగుల పొడవు, పొడుక్కా అగ్గ లావు. పచ్చని ఛాయ, అందమైన అవ యవ సౌష్ఠవంతో, ఆ అందాన్ని మరింతగా పెంచే అధునాతనమైన అలంకరణతో, పేపరు చూస్తూ కుర్చీలో కూర్చున్నది.

"వీరేనండి!" కర్టెన్ తొలగించుకుని వచ్చిన శ్రీలక్ష్మితో అన్నాడు వీరయ్య

ఆ మాటలు విని లేచి నుంచుని, "నమ స్కారమండి!" అన్నది ఆ అపరిచితురాలు

"నమస్తే... కూర్చోండి ..." అని తను కూర్చుంది శ్రీలక్ష్మి,

"సార్ పనిచేస్తున్న ఆఫీసులో నిన్నని



అపాయింటు అయ్యాను నా పేరు నిర్మల" అని తను పరిచయం చేసుకున్నది శ్రీలక్ష్మికి.

" . ... ... ... ..."

"నిన్నటి యింటర్వ్యూలో సార్ నాకు చాలా హెల్ప్ చేశారు నాకంటె ఎక్కువ అర్హతలున్న వాళ్ళు కూడా వచ్చారు యింటర్వ్యూకి అయినా నన్నే వేసుకోమని ప్రెస్ చేశారు సార్! ఆయన అంత పట్టు పట్టక పోతే నాకీ వుద్యోగం వచ్చేది కాదు" కృతజ్ఞతగా అన్నది నిర్మల

" . ... ... . "

"ఒక్కొక్కళ్లను చూడగానే మనకు తెలియకుండానే ఒక రకమైన అభిమానం ఏర్పడుతుంది. మన అదృష్టాన్నిబట్టేవాళ్లకు ఆ భావన కలుగుతుందని నా నమ్మకం. ఏదో నా సంతోషంకొద్దీ యింటికి వస్తే, అంటే మీరు ఊళ్లో లేరని చెప్పారు అయినా ఈ టైంలో అయితే సార్ యింటిదగ్గర వుంటారుగదా కృతజ్ఞత చెప్పి వెళ్లాలని వచ్చాను ఇంకా ఎనిమిది కాలేదు అప్పుడే వెళ్లిపోయార్ట. పోనీలెండి. మిమ్మల్నిచూశాను. చాలా సంతోషంగా వున్నది" చెప్పుకుపోతున్నది నిర్మల.

మౌనంగా వింటున్నది శ్రీలక్ష్మి.

"పళ్ళు సార్ కోసమని తెచ్చాను వుంచండి ఆఫీసువేళ అవుతున్నది. వస్తా!" అని వ్యానిటి బ్యాగు తీసుకుని సుతారంగా నడుస్తూ వెళ్లిపోయింది నిర్మల. ఆమె మీదనుంచి చూపు మరల్చలేక పోయింది శ్రీలక్ష్మి "ఎంత అందం" అనుకున్నది మనసులో! మళ్లా ఓ అసూయ రేఖ!

"ఓ అందమైన ఆడపిల్లకు సహాయం

# సీ సా లు

చెయ్యటం ఏమంత విశేషంకాదులే! "పెద్దింటి వాళ్ళు మనవాళ్లయితే" అన్న సామెతగా, అర్హతలకు ఉద్యోగాలకు సంబంధంలేదు నీలాంటి వాళ్లంతా ఉద్యోగాలకు వస్తే అర్హతలున్న వాళ్లంతా అవతలకు వెళ్లవలసిందే! ఇంకా పైగా చెబుతున్నది, సభ్యతలేకుండా ! నేను ఇంట్లో లేననితెలిసే వచ్చిందట ఇందాక ఆ పద్మావతి ఆయన ఎప్పుడు వెళ్తున్నదీ తిరిగి ఎప్పుడు వస్తున్నదీ వివరాలన్నీ తెలుసుకున్నది. ఇప్పుడీ నిర్మల నేను లేనని తెలిసి, వయసులో వున్న పిల్ల అంత అందంగా అలంకరించుకుని వచ్చిందంటే ... ఛీ ... నైతిక విలువలు పూర్తిగా నాశన మౌతున్నాయ్! అయినా మన బంగారం మంచిది కానప్పుడు వూళ్లో వాళ్ళ ననటం దేనికి ? ఇంత వయసు వచ్చింది నాలుగు రోజులు... అదే ఓ నెల రోజులు ఊరికెళ్ళివస్తే ఇంత అప్రాచ్యపు ఛ చ. అవతల పెళ్లి కెదిగిన పిల్ల... ఏమిటో! ఈ రోజుల్లో పెళ్లిళ్లల్లో పెళ్లి వారికి కూడా అన్నీ సరఫరా చెయ్యాల్ట."

"అమ్మగారూ ! బుట్ట లోపల పెట్ట నాండి ?"

"ఊ!" నిర్మల తీసుకువచ్చిన పళ్ల బుట్టను చూసిన కళ్లే మూలనున్న సీసాల బుట్టను చూసినయ్

"ఖాళీగా ఉన్నప్పుడు ఆ బుట్టలో వున్న రక రకాల సీసాలతో అందమైన వేజులు చేసి, ప్లాస్టిక్ పూలు అమర్చి టీపాయ్ మీద పెట్టాలి. కొన్ని అగరొత్తుల స్టాండుగా తయారుచేసి పడక గదిలో అమర్చుకోవచ్చు! మూతలు గట్టిగా వుంటే పప్పులూ, పిండీ, పోసి మూతలు పెట్టుకోవచ్చు అన్నట్లు పెళ్లిలో డ్రింక్స్ అంటే పెళ్లికొడుక్కి గూడా అలవాటు వున్నట్లే గదా! అమ్మో ! పిల్ల జీవితం నాశనం అయి పోదూ ! ఇంత వయసు వచ్చాక ఆయన ఎటూ ఇహ నా మాట వినరు అమ్మాయితో చెప్పాలి మొదట రాత్రి నుంచి అల్లుణ్ని అదుపులో పెట్టుకో మని, అయినా ఏం మగవాళ్లు బాబూ!"

"అమ్మగారూ! బంగాళదుంపలు కోశాను, స్టౌ వెలిగించాను" రాములు మాటతో ఈ లోకంలోకి వచ్చిన శ్రీలక్ష్మి జోరీగల్లా ముసురుతున్న ఆలోచన్ను పక్కకునెట్టి, వంటింట్లోకి వెళ్లి బియ్యం కొల్చి గిన్నెలో పోస్తుండగా, "లాగేవాళ్లు ఎక్కువ అన్నం తినలేరు. ఈ బాధలో నాకు మాత్రం ఏం సయిస్తుంది" అనుకుని రెండు గ్లాసులు బియ్యానికి బదులు ఒక గ్లాసు బియ్యమే కడిగి స్టౌ మీద పెట్టి రెండో స్టౌ మీద బంగాళ దుంపల ముక్కలు వేస్తుంటె శ్రీలక్ష్మి మనసు అంతకంటే ఎర్రగా వేగి పోతున్నది. మూలనున్న సీసాల బుట్ట, పక్కింటి పద్మావతి, అందమైన లేడీ క్లర్క్ నిర్మల, డ్రింకు బాటిల్సులా తయారయిన అలంకరణ సామగ్రి, అమ్మాయి పెళ్లి, అల్లుడు తాగుడు ..ఏమిటీ మనుషులు, ఎందుకిట్లా మారిపోతున్నారు ? మనుషులు కాదు మారుతున్నది నైతిక విలువల్ని గురించి, విదేశాల్లో భారతి స్త్రీలపై సున్న అభిప్రాయాల్నిగురించి, ఆధ్యాత్మికంగా మన ఔన్నత్యాన్నిగురించి గంటలుగంటలు ఉపన్యాసాలిచ్చే మంత్రిపుంగవులు ఓట్లకోసం ప్రొహిబిషన్

---

16-4-1976 శుక్రవారం మొదలు

22-4-1976 గురువారం వరకు

మేషం — మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు బంధుమిత్రులను కలుసుకొంటారు

వృషభం — మీ ఆలోచనలు ఫలిస్తాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం ఆఖరులో ఆర్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది

మిధునం — రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది ప్రయాణాలు వాయిదా పడతాయి రావలసిన డబ్బు అందుతుంది భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగుంటాయి వారం ఆఖరులో చికాకులకు గురి కాగలరు స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది దైవ కార్యాలు నెరవేరతాయి.

కర్కాటకం —సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది అనవసరమైన సందేహాలు కలుగుతాయి వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.




సింహం — పరస్పర వ్యవహారాలు బాగుంటాయి పోటీవారితో గౌరవం లభిస్తుంది వృత్తిలో మంచి అవకాశాలు లభిస్తాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

కన్య — వ్యాపార విస్తరణ ప్రయత్నాల




వార్నీ! మీరు డాక్టరా!! నేనిన్నాళ్లూ మీ రచనలు మాలాంటి పాఠకులకి అర్థం కాకపోవడానికి కారణం మీ గొప్పతనమే అనుకున్నా సుమండీ!

---

లీసేసి పూరంలా బ్రాందీ షాపులు తెరిపించి రకరకాల ఎడ్వర్టయిజుమెంట్లు వేయిస్తుంటే చూస్తు ఎవరూరుకుంటారు''

''అమ్మగారూ మాడిపోతున్నదండీ!'' రాములు మాటవిని ముక్కలవైపు చూస్తే అవి నల్లరంగులోకి మారుతున్నాయి. అయ్యయ్యో! మాడిపోయ్యేవే!'' అనుకుని కారంపిసాలీసి ఓ చెంచాడు వెయ్యాహోయి, ఈ డ్రింకులు పాటు తాగేవాళ్లు ఎక్కువ కారం తినలేర్స'' అనుకుని అరచెంచాడు వేసి బాండి దించేసింది.

''అమ్మగారూ! వచ్చినదగ్గర్నుంచి అదోలా వున్నారు అక్కడ అంతా కులాసా ఏనా?'' చనువుగా అడిగాడు ముసలి బంట్రోతు వీరయ్య

''ఆ! ఆ! అయ్యగారు ఎన్నింటికి వస్తారు!''

'తెలీదమ్మా! రోజు ఇంటికి రావటంలేదు' వీరయ్య జవాబు

అవున్లే! యజమాన్ని గురించి అంతకంటె ఏం చెబుతాడు.

''నేనువెళ్లి తీసుకురానా?'' అడిగాడు

ఆ తాగేదేదో విదేశాలదయితే మంచిదట. ఏనాటుసారయో తాగి ఒళ్లు తెలీకుండా ఎక్కడన్నా పడిపోతే అది ఈ బంట్రోతులెవరన్నా చూస్తే... ఆపరిస్థితిలో గిట్టనివాళ్ళెవరన్నా చూసి, గవర్నమెంటుకి రిపోర్టుచేస్తే ... ఉద్యోగంలోంచి నిర్బంధ రిటైరుమెంటు, కేసు, కోర్టు, అవినీతి ఆరోపణలు, పిల్లల చదువులు, పెద్దపిల్ల పెళ్లి, ఆర్థిక ఇబ్బందులు, నలుగుర్లోను నగుబాట్లు, మనసులో బాధ, పిల్లలదగ్గర చిన్నతనం, ''వద్దు వద్దు,'' అనుకోకుండావద్దన్న మాట పైకే అనేసింది

''మీరు వచ్చినట్లు అయ్యగారికి తెలీదు గదండీ! వెళ్లి చెప్పివస్తా!'' అమాయకంగా అన్నాడు వీరయ్య

''ఒక్కడివే వద్దు. ఇద్దరూ వెళ్లండి'' భర్త నాటుసారాతాగి రోడ్డుమీద పడుంటే తీసుకురావటం ఒకడివల్ల కాదుగనక ఇద్దర్నీ వెళ్లమంటున్న శ్రీలక్ష్మి వాకిట్లో రిక్షా ఆగటం చూసి, ఎవరో లని తలుపుదగ్గర కొచ్చింది. రమేష్! ఒకచేతిలో ప్యాకెట్టు, మరో చేతిలో మల్లెపూల పొట్లం. హుందాగా హుషారుగా లోపలకువస్తూ, ''దేవిగారిరాక ఎప్పుడో!'' అన్నాడు నాటక ఫక్కీలో.

భర్తలో ఏమార్పు లేకపోవటం చూసిన శ్రీలక్ష్మి ఆశ్చర్యపోతూ మౌనంగా లోపలకు నడిచింది.

తన చేతిలోని ప్యాకెట్టు భార్యకిస్తూ ''ఇది నీకు మొదటి బహుమతి నువ్వు వచ్చినట్లు నిర్మల చెప్పింది వస్తున్నట్లు ఉత్తరం రాస్తే వీరయ్యను స్టేషనుకు పంపించేవాడ్నిగా! ఆ! అన్నట్లు నన్ను సమర్థవంతమైన ఆఫీసరుగా గుర్తించి పదివేల రూపాయల నగదు బహుమతి ప్రకటించింది ప్రభుత్వం ఓ వారం రోజుల్లో ఆ కాగితాలన్నీ తయారుచేసి పంపించాలి నువ్వు వెళ్లిన మర్నాడే ఓ ఆర్డరు వచ్చింది. అప్పటినుంచి రాత్రింబగళ్లు ఆఫీసు పనితోనే సరిపోతున్నది. నువ్వు వచ్చిన తర్వాత చెప్పి నిన్ను సర్—ప్రైజ్ చెయ్యాలని ఉత్తరంకూడా రాయలేదు 'మన యింటికి నేనే ప్లాను వేస్తాను.' అంటావుగా! పెద్ద బుక్సెండు ఇంజక్షన్ బాటిల్సు కొని అక్కడ పెట్టాను. నాలుగు రోజుల్లో నీ మోడల్ హౌవుస్ తయారయితే గవర్నమెంటు ఇచ్చే పదివేలకు తోడు ఇంకో పదివేలు లోను తీసుకుని చిన్న యిల్లు కట్టుకుందాం! అమ్మాయి పెళ్లికి టైం వున్నదిగా!'' గుక్కతిప్పుకోకుండా చెప్పాడు రమేష్!

ఆలోచన్ల ముసురులోనుంచి, అనుమానాల దొంతరల్లోనుంచి బయటపడి తేలిగ్గా గాలి పీలుస్తూ ''మధ్యాహ్నంపూట మల్లెపూలెందుకు?'' అన్నది శ్రీలక్ష్మి.

''మల్లెపూలకు మధ్యాహ్నం, రాత్రిలేదు, ఎప్పుడయినా అవి అందంగానే వుంటాయ్'' అంటూ శ్రీలక్ష్మి దగ్గరగా వెళ్లాడు రమేష్.

---

బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి ప్రయాణాలు వాయిదా పడతాయి వారం ఆఖరులో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు పుణ్యకార్యాలు చేస్తారు.

తుల — రావలసిన డబ్బు అందుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో పోటివారి పోటీ తగ్గుతుంది వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు

వృశ్చికం :— మీ కార్యక్రమాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు

ధనుస్సు :— వ్యతిరేకమైన వార్తలను వింటారు సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వృత్తిలో ఆదాయం పెరుగుతుంది ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు బంధుమిత్రులను కల్సుకొంటారు

మకరం :— మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. రావలసిన డబ్బు అందుతుంది వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు వారం ఆఖరులో అనుకూల పరిస్థితి ఏర్పడగలదు స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది.

నూతన విషయాలను తెల్సుకొంటారు

కుంభం :— అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది

మీనం :— ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధి సాధిస్తారు స్త్రీలకు — వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

# డాక్టర్ సలహాలు

—డా. కె. వెంకటేశ్వర

కె ఎస్ డి నరశీపురం

భార్యభర్తల మధ్య కలతలు రేపేవాళ్లన ఏవి నారి ?

అసలు మధ్య వాళ్ల మాటంకే విలువ నిచ్చే భార్యభర్తల నేంనలో ఆలోచించండి

టి వి ఆర్ పి జార్పుగూడ

సంసారం స్త్రీకి పంజరం అయిందంటాను బయట వుండి చూసేవారికి కిటికీ వెనక వ్యక్తి కటకటాల వెనక వున్నట్లు కన్పించడం సహజమే కద !

డి వి ఎస్ శింగనమల

స్త్రీకి స్వాతంత్ర్యం స్వరాజ్యం అనేవి చదువుకుందుకు వినడానికేగాని ఆచరణలో పెట్టడానికి కాదని నానమ్మకం

మరి, మీరెలాగా ఏదీ ఆచరణలో పెట్టరు కద మీ కెందుకా స్వేచ్ఛ స్వతంత్రాలు ?!

పి ఎస్ ఆర్ విశాఖపట్నం

మీ సమాధానలవల్ల చాలామంది స్త్రీలు తమ భర్తలపై తిరగబడుతున్నారు..

తమ ఉద్దేశ్యలు చెప్తున్నారంటే బాగుంటుందేమో ? అభిప్రాయ ప్రకటనలు తిరగబడ్డం ఎలా లవుతుంది ?!

డి జి ఎమ్ విజయవాడ

ఆశ వాదికి, నిరాశా వాదికి తేడా ఏమిటి ?

ఏమందీ, ఆశ వాది 'పెరుగువడ్డించండి అంటు నిరాశ వాది 'కొంచెం మజ్జిగేనా వుందా ?' అంటాడు !

జి వి. ఆర్ బ్రాహ్మణగూడెం

భార్యభర్తల సంబంధం చాలా సున్నితం అయినది ఎంతో జాగ్రత్తగా కాపడుకోవాలి ఆబాధ్యత మగాళ్లకన్న ఆడవాళ్లకే ఎక్కువ కదంటారా ?

ఎలా ? ఇద్దరిదీ సంటాను ఒక్క భార్య బాధ్య వుస్తంతమాత్రాన ఏ సంసారమూ సవ్యగా సాగదు

బి ఎల్. – పరమటూరు

నా వయస్సు 20 సంవత్సరములు, వివాహమై 2 సంవత్సరాలు అయినది నేను గర్భిణిగానున్నప్పుడు 5 వ నెలనుండి పొట్టమీద చాలా దురదగా వుండేది ప్రసవించిన తర్వాత దురదపోయి తెల్లనిచారలు ఏర్పడినవి అట్లు వచ్చుటకు కారణమేమిటి ? అవి పోగొట్టుటకు ఏమి చెయ్యాలి ?

స్త్రీలు గర్భిణిలుగా ఉన్నప్పుడు 'పొట్ట' మీద తెల్లనిచారలు ఏర్పడటం చాలా సహజం ప్రకృతి సిద్ధం కూడా ! ఈ చారలు గర్భం, ధరించినప్పుడే ఏర్పడినా, ప్రసవానంతరంఎక్కువగా కనిపించటం జరుగుతుంది ఈచారలు రావటానికి ప్రత్యేకంగా కారణమంటూ ఏదీ ఇంతవరకు కనుగొనబడలేదు గర్భసంచి పెరుగుతూ రావటం, అందువల్ల కడుపుగోడలు కూడా ఎక్కువగా సాగవలసి వుండటంవల్ల అక్కడి కండరాలు కూడా అలాగే అవటం వాటిలోని రక్తనాళాలు చిట్లి రక్తం చేరటం, ఆ రక్తం పారినచోట్ల కొన్నిరోజుల తర్వాత తెల్లని మచ్చలేర్పడటం జరుగుతుందని ప్రస్తుతం వూహింపబడుతున్న సిద్ధాంతం వాటికి ప్రత్యేక చికిత్స అవసరంలేదు

ఎన్ పి ఎల్. — అమృతలూరు

నాకు తెల్ల శోబి వున్నది ఎన్నో మందులు వాడినాను ప్రయోజనము కన్పించలేదు. ఏమి చెయ్యాలనో తెలియచేయండి

ఈ తెల్ల శోభి మచ్చలు ఎందువల్ల వస్తాయో ఇంతవరకుకూడా ఎవ్వరూ కనిపెట్టలేకపోతున్నారు. మచ్చలనేవి ఏర్పడటం, అవి తెల్లగా ఉండటానికి కారణం మాత్రం శాస్త్ర సమ్మతంగా నిరూపించబడిందే గాని, సమూలంగా ఆ మార్పులు, శరీరంలో జరిగేలా చేసే పదార్థాలు (ఘన, ద్రవ, వాయువులలో ఏ రూపంలో ఉన్నా సరే)ఏమిటి? ఇది ఒకే కుటుంబంలో వంశపారంపర్యంగావస్తుందనే నమ్మకం నిజమేనా మొదలయినవిషయాలకు జవాబు ఇంకా లభించలేదు. పూర్తి వివరాలు ఆ రోగాన్ని గురించినవి అర్థం అయినప్పుడే ఈ రోగానికి మందు ఫలానా అని తేల్చి చెప్పడం లేదా కొన్ని మందుల మిశ్రమం వాడటం, "పదిరాళ్ళు వేస్తే ఏదో ఒకటయినా తగలదా!" అనేసామెతగా తయారవుతుంది.

పి. ఎస్ ఎన్. — సీతాఫల్మండి.

నా బంధువు ఒకాయన వయస్సు 60 సం లు 6 సం ల క్రిందట ఆయనకు ఎడమ చెంపక్రింద పెదవి ప్రక్కగా పుండు ఏర్పడి తరువాత ఆ చెంప భాగమంతా ఉబ్బి చూడటానికి వికారంగా తయారయినది ఈ పుండు పగిలి చీము కారినప్పుడు విపరీతమైన బాధ పడేవాడు డాక్టరు ఆపరేషన్ చేశారు. అయినను అవి పూర్తిగా మానలేదు.

6 సం లుగా ఉన్న కురుపు, పెద్దదవుతూ వస్తూ వున్నప్పుడు, దానిని పెద్ద ఆస్పత్రులలో చూపించకుండా ఉండటం (ఇంతవరకు అలా చూపించక పోతే) నిర్లక్ష్యాన్ని మాత్రమే తెలియచేస్తున్నది! ఈ కురుపు "కేన్సర్" అనే "పుట కురుపు" ని సూచిస్తుందని నా అభిప్రాయం! 'మొక్కై వంగనిది, మానైతే వంగదన్నట్లు" ఆలస్యం అయినకొద్దీ ఈ రోగం నయమయ్యే అవకాశం చాలా తక్కువ అనే చెప్పాలి వెంటనే పెద్ద ఆస్పత్రిలో సర్జన్లకి చూపండి.

ఎల్. ఎస్. ఎన్. — నర్సాపురం.

హెూమో సెక్సువాలిటీ అంటే ఏమిటి? దానివల్ల వచ్చే నష్టాలేమిటి?

"హెూమో సెక్స్" అంటే ఒకే లైంగికతెగ అని మాత్రమే అర్థం అవుతుంది.

తమ తోటి వారితోనే కలసి మెలసితిరగటం, యుక్త వయస్కులైతే లైంగిక సుఖాన్ని కూడా తమ తోటివారితోనే అనుభవించగలిగే లక్షణాలు కలిగి ఉండటాన్ని "హెూమో సెక్సువాలిటీ" (క్వాలిటీ అంటే ఒక గుణం లేదా లక్షణం అని అర్థం కదా)

దీనివల్ల నష్టాలంటూ ప్రత్యేకంగా ఏవీ లేవు. కాని వ్యక్తిగతంగా మాత్రం తాము తప్పుచేస్తున్నామని తెలుసుకుని అలా చేయటంవల్ల ఏదైనా కోల్పోయామేమోఅనేమానసికవ్యధమాత్రంకొందరికి ఉండటం , ఆ వ్యధతోనే సర్వకాల సర్వావస్థలందూ బాధపడటం, ఆహారం తీసుకోకపోవటం వల్ల శారీరక క్షీణత ఏర్పడటం జరుగవచ్చు!



# వెలుగుబాట

## పి.వి.బి. శ్రీరామమూర్తి

కమల గాభరా పడిపోతూ, "బావా బావా! ఎక్కడికి వెళ్ళిపోయావ్ బావా? నీ కోసం నేనింకా అన్నం తినకుండా కూర్చుండిపోయాను రా కాళ్ళు కడుక్కొని అన్నం తిందాం." అని ఇద్దరూ కాళ్ళు కడుక్కొని వచ్చి కంచాలు దగ్గర కూర్చుంటే, "బాబూ! నీకూ నోచుకోవాలనుందా అమ్మా?" ముద్దుగా అడిగింది కమల తల్లి గోపాలాన్ని. కమల తల్లి కళ్ళలోకి ఆనందంగా చూస్తూ "అమ్మా! మగపిల్లలు నోచుకోరాదేంటి అసలు?" అంది. కమల తల్లి కమల ప్రశ్నలకి పకాలున నవ్వింది. "మరిందాక నీకేదో పెద్ద తెలిసిపోయినట్లు నవ్వేసావమ్మా?" అన్నాడు గోపాలం "అంతమందీ నవ్వారు నాకూ నవ్వొచ్చింది నవ్వాను" అంది కమల "నాన్నా! దానికేం తెలియదురా అసలు? పోనీలే నీకు నేను పళ్ళా అవీ యిస్తాను పోయి రామూతో ఆడుకో రేపటికి అలాగేనా?" గోపాలాన్ని బుజ్జగిస్తూ అంది కమల తల్లి. గోపాలం "అదీ, అదీ అత్తయ్యెంతో మంచిది" అని చంకలు గుద్దుకున్నాడు "బావా! అయితే నా జట్టుండవా?" కమల అమాయకంగా కళ్ళు త్రిప్పుతూ అడిగింది "ఉంటాన్లే అత్తా కమల కూడా చాలా మంచిదేనత్తా!" అన్నాడు "వెధవా! దానికేంతెలియదు. వెర్రిముండ వీడెలాగంటే అదీ అలాగే అంటుంది అందుకే వీడిష్టం వచ్చినట్లు వేషాలేస్తున్నాడు" అన్నది గోపాలం తల్లి. తరువాత గోపాలం, కమల చాలా సేపు కబుర్లు చెప్పుకున్నారు "కమలా! నామీద కోపం వచ్చిందా?" ఎవ్వరికీ వినిపించకుండా మెల్లగా అడిగాడు గోపాలం "ఉహూఁ" అన్న కమల బుగ్గలమీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు గోపాలం "మరెప్పుడూ కొట్టనులే" అని కమల దగ్గరగా చేరుతూ

కమలకి ఆ విషయాలన్నీ యిప్పుడు ఒక్కొక్కటే గుర్తుకొచ్చి ఒక మధురమైన అనుభూతి కలుగుతోంది మళ్ళీ ఉత్తరంలో తనని గురించి పెద్దగా వ్రాయకపోవటం

[గత సంచిక తరువాయి]

గుర్తుకొచ్చేసరికి కోపం దుఃఖం మిళితమై గుండెను పిండి చేస్తున్నట్లనిపించింది చాలా కాలంగా ఉత్తరాలలో తనగురించి పెద్దగా వ్రాయటం మానేసాడు బావ సెలవలకి ఇంటికొచ్చినపుడు కూడా ఎంతో ఆప్యాయంగా మాట్లాడటమే మానేసాడు తాను కాలేజి విషయాలడిగినా, ఉత్తరాలు ఎందుచేత వ్రాయటం లేదని అడిగినా, కోపగించుకోవటమో, చికాకుగా వీధిలోకి వెళ్ళిపోవటమో చేసే సంఘటనలు జ్ఞాపకానికొచ్చినపుడు దిగాలుగా అయిపోతుంది కమల సజల నేత్రాలతో పరధ్యానంగా వాలు కుర్చీలో కూర్చున్న కమల్ని చూసిన మేనత్త "ఏమ్మా! ఏంటా కన్నీరేమిటి? ఏడుస్తున్నావా?" అని అడుగుతుంటే కమల ఆత్రుతగా కళ్ళు తుడుచుకుని, "అబ్బే కళ్ళలో ఏదో పడింది" అని కళ్ళను పైటకొంగుతో అద్దుకుంది "అబద్ధమాడుతున్నావ్ కదూ?" అని "బావ ఏం వ్రాసాడమ్మా?" అనడిగింది. "బావకి నేను జ్ఞాపకం ఉంటేగా? కనీసం ఒక్క వాక్యమైనా వ్రాస్తే బావ సొమ్మేం పోయిందని? నువ్వే చదువుకో ఉత్తరం నాన్నగారికే వ్రాసాడు" అని ఉత్తరం విసిరేసి పక్కకి తిరిగిపోయింది కమల విసిరేసిన ఉత్తరం తీసి చదువుకుని గట్టిగా నిట్టూర్చింది కామాక్షమ్మ "ఏమిటో వీడూ, వీడి చదువూను ఎంత డబ్బూ చాలదు వెర్రినాగన్న ఎంతకన్న పంపుతాడు వాడు మాత్రం? రాత్రి పగలు అనకుండా వాడి చదువుకోసమే ఆరో

> **జరిగినకథ :** గోపాలం వ్రాసిన ప్రేమలేఖను అందుకొంటుంది రిటైర్డ్ పోలీసు ఆఫీసరు రామచంద్రరావు కూతురు కృష్ణవేణి గోపాలంబావ, తన తండ్రికి రాసిన ఉత్తరంలో తన ఊసులేదన్న వ్యధలో చిననాటి ప్రేమ గుర్తుకొస్తుంది కమలకి

చిస్తుంటాడు చివరికి ఏం చేస్తాడో ఆ వెంకి వెధవ?" తనలో అనుకుంది కామాక్షమ్మ తరువాత తిరిగి ప్రక్కకి తిరిగిపోయిన మేనకోడల్ని బుజ్జగిస్తూ, "తప్పు కదమ్మా అలా కన్నీరు పెట్టొచ్చా దా ఇటు చూడు. ఈసారి వాడు రానీ రెండు చీవాట్లేస్తాను" అని ఏడుస్తున్న కమలను గట్టిగా గుండెలకి అదుముకుంది అప్రయత్నంగా కామాక్షమ్మ కళ్ళలో కూడా కన్నీరు గిరున తిరిగింది. కమలతల్లి అంతా విని ఇంటోంచి వస్తూ, "బాగుందొదినా! నీవూ, మీ కోడలూను ఎవరైనా నవ్వగలరు పాపం వాడికి చదువుకోటానికే టైము చాలదంటాడు దీనికి ఉత్తరాలు వ్రాస్తూ కూర్చుంటే మరి వాడు చదువుకోనక్కర్లేదేమిటి?" కమల వేపు కోపంగా చూస్తూ, కామాక్షమ్మని కసురుకుంది వీధిలోంచి యింట్లోకి వస్తున్న తండ్రి అడుగుల సవ్వడి విని, అక్కణ్ణుంచి లేచిపోయింది కమల తండ్రి వస్తూనే, "అమ్మా, కమలా బావ ఈరోజైనా ఉత్తరం వ్రాసాడా తల్లీ?" అని ప్రశ్నించాడు. వ్రాసినటు చెప్పింది కమల

"ఏం వ్రాసాడమ్మా?" అని ఆత్రుతగా ప్రశ్నించాడు.

"ఏం వ్రాస్తాడు? మళ్ళీ ఆరొందలు పంపమని వ్రాసాడు" విసురుగా అన్నది కామాక్షమ్మ కమల తండ్రి ఒక్క నిమిషం నిట్టూర్చి, "ఇదిగో అక్కా! వాడేం పోకిరి వేషాలు వేసే రకం కాదు తెలుసా? వాడికెంత అవసరం ఉంటుందో, అంతకంటే ఒక్క పైసా ఎక్కువ పంపమని వ్రాయడు తెలుసా? నువ్వనవసరంగా వాడ్నేదో అంటుంటే నాకు చాల కష్టంగా ఉంటుంది సుమా!" అన్నాడు కమల తండ్రి

"చూడరా బాబూ! ఆయన పోయిన దగ్గరనుంచి మా భారమంతా నువ్వే మోస్తున్నావ్ వాడెంత చదువుతానంటే అలాగేనని నువ్వొప్పుకొని, వాడెలాగ ఆడిస్తే నువ్వూ అలాగే ఆడుతున్నావ్ ఇక నువ్వేం పంపిస్తావ్? అయిదు గరిసెలు పండే పొలం వాడి చదువుకోసం అమ్మేసావ్ ఇల్లేమో తనఖా క్రింద ఉంచేసావ్ ఇక చాలు నీ ఆరోగ్యం చూస్తే రోజు రోజుకీ దిగజారిపోతోంది వాణ్ణి ఉద్యోగంలోనో చేర్పించి, నేనుండగానే కమలకి వాడి చేతుల్తో ఆ మూడు ముళ్ళూ వేయించేస్తే చాలు. నువ్వనవసరంగా బాధపడి

నాదికేం డబ్బు పంపనక్కరలేదు. నువ్వు వ్రాయలేకపోతే నేనే వ్రాస్తాను ఆ కాయితం, కలం యిలా పడేయ్" అన్నది కామాక్షమ్మ

"ఏమిటొదినా? మీరన్న మాటలు? వాడి చదువు పూర్తి కాకుండా ఎలా మానిపించేస్తారేంటి? ఇంకెంత కాలం మనం కష్టపడాల్సింది?" కమల తల్లి అంది

"అక్కా! ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో నాకు తెలుసు నువ్వు నాకేం చెప్పనక్కర్లేదా విషయంలో ఆ మిగిలిన పొలం ఏదోనా ఉండనే ఉంది దానిపుడే అమ్మేసి పంపిస్తే సరిపోయింది కదా? వాడిచదువు పూర్తయి, ఉద్యోగం వెయింవాక, కమలకీ వాడికీ పెళ్ళి జరిపించేస్తే నాకు మిగిలిందింకేవరున్నారని? అల్లుడయినా, కొడుకయినా నాకు వాడే కదా!" అన్నారు

"తండ్రీ ఏడుకొండలవాడా! ఈ కుటుంబాన్ని ఎలా రక్షిస్తావో, ఎలా దరికి చేరుస్తావో అంతా భారం నీదే' అని మనసులో ఆ శ్రీనివాసుడికి మ్రొక్కుకుంది కామాక్షమ్మ

అస్తమిస్తున్న సూర్యుని రాగ రంజితమైన కిరణాలు కదులుతున్న సముద్రపు అలల మీద పడి వింత శోభను సంతరించుకుంటున్నాయి. సముద్రంలో అక్కడక్కడా వచ్చేపోయే బోటులు కనపడుతున్నాయి మెత్తని ఇసుకలో కూర్చున్న కృష్ణవేణి నీటిమీద నుంచి వస్తున్న గాలి చల్లగా తగుల్తోంది. గాలి తాకిడికి తలంటుకున్న కృష్ణవేణి ముంగురులు ఆమె నుదుటిపై ఆనంద నాట్యం చేస్తున్నాయి కృష్ణవేణి చూస్తుంటే మనసులో ఉన్న మధురానుభూతులు పంచేనిండా అల్లుకుంటున్నాయి గోపాలానికి

కృష్ణవేణిది అందమైన పరిణామం కోలముఖం ఏర్చికూర్చిన పెలిమి యిర్యాల సరంలా ఉన్న ఆమె పలువరుసని, ఎర్రని ఆమె అధరంపై విరిసించే యిల్లెపు పులాటి స్వచ్ఛమైన ఆమె నవ్వుని, విలాసంగా పరుగులు తీసికుంటూ ఆడుకునే మీనాల్లాంటి ఆమె కళ్ళనీ, మనసును చురులుగొలిపే ఆమెచూపుల తూపులనీ, నల్లని నిగనిగలతో పదులుగా గాలికి అల వోకగా ఎగురుతున్న ఆమె కురుల్ని, కురులలో తురిమిన సన్నజాజుల్ని, చల్లని పరెతో మెరుపు తీగలా మెరిసిపోతున్న ఆమె ఆకారాన్ని చూస్తున్నంతసేపూ గోపాలానికి ఈ లోకం గుర్తులేకుండా పోతుంది

కృష్ణవేణి ఒయ్యారంగా ఇసుకలో కూర్చుని, జుట్టు చివరల్ని వేళ్ళకు చుట్టుకుంటూ, మాట్లాడకుండా కూర్చున్న గోపాలాన్ని చూసి "మీకు కోపం తెప్పించానా?" అంది గోపాలం నుండి ఏం సమాధానం వస్తుందోనని.

"మీ మీద కోపగించుకోటానికి నేనెవర్ని?" గోపాలం అన్నాడు "నాకు మీరేమీ కావల్సుకోలేదా?" అన్న కృష్ణవేణి ప్రశ్నకు అతని మనసులో అనంత నునూలు ఎరిసాయి

"అనుకున్నా మీరు కానివ్వరుగా!"

"అయితే మీకు బాగా కోపం వచ్చిందన్న మాట నామీద" గోపాలం కళ్ళలోకి చూస్తూ అంది కృష్ణవేణి

"మీమీద నాకెప్పుడైనా కోపం వస్తుందా అసలు?"

"ఎందుకు రాకూడదు!"

"ఎందుకు రాకూడదని కాదు కాని ఎందుకు రాదో మాత్రం చెప్పలేను. నేను బాగా యిష్టపడిన వాళ్ళను కోపగించుకోలేను"

"థాంక్స్" అని "మరి అలా మాటాడకుండా కూర్చుండిపోయారేం?" అంది.

"ఏదో ఆలోచిస్తున్నాను."

"ఏమిటాలోచిస్తున్నారు?"

"మీకు నామీద కోపం వచ్చి ఉంటుందేమోనని"

గలగలా నవ్వింది కృష్ణవేణి. నవ్వి, "నాకా? ఎందుకు?" అన్నది

"మీ మనసు తెలుసుకోకుండా ప్రవర్తించినందుకు"

"పోనీ యిప్పుడు తెలుసుకున్నారా?"

"ఏం తెలుసుకున్నాను?" అలల సవ్వడితో శ్రుతి కలుపుతూ నవ్వింది కృష్ణవేణి.

"సరే సమాధానం లేకపోతే పోయింది. కనీసం నా వేపు కూడా చూడటం మానేసారేం" అన్నాడు.

"ఇపుడు తనివితీరా చూస్తున్నాగా!"

గోపాలం తనువు పులకించింది. మనసు పల్లవించింది.

"పోనీ నా ప్రశ్నకు సమాధానం ఇప్పుడైనా చెప్పగలరా?"

"చెపుతాను." అని గోపాలం ఆసక్తితో సమాధానంకోసం ఎదురు చూస్తున్నంతలో.

"కాని — ఇపుడుకాదు. "నాకు కొంత టైం కావాలి!"

"నెల రోజులు టైము ఆలోచించుకోడానికింకా చాల్లేదా?"

"ఒక మనిషిని చదివి ఆలోచించుకోవాలంటే నెలరోజులేకాదు... కొన్ని సంవత్సరాలయినా పట్టవచ్చు."



# వెలుగుబాట

కృష్ణవేణి అంతకుముందుకంటే గంభీరంగా కనిపించింది గోపాలానికి తొణకని వెణకని ఆమె మనస్తత్వం అతనికి మరింతగా నచ్చింది

"ఈ సముద్రానికీ, మీకూ దగ్గర పోలికలు కనిపిస్తున్నాయి. ఇది ఈ చెలియలి కట్ట దాటి అవతలకి పోదెప్పుడూ. మీరూ మీ నోట్నించి అనవసరంగా ఒక మాట బయట పడనివ్వరు"

"ఉహుం... మీకు కవిత్వం కూడా వచ్చన్న మాట"

"నాకే కవిత్వం వస్తే మీమీద ఓ వంద కావ్యాలు వ్రాసి ఉండేవాణ్ణి."

"అయితే మీకు కవిత్వం చెప్పటం రాకపోవటం నా అదృష్టమే అన్నమాట."

"ఏం?"

"నామీద మీరు ఏ వంద కావ్యాల్ని వ్రాసి వుంటే నేనే తాళపత్ర గ్రంథాలయం. అడుగునో పడి వుండేదాన్నిగా ఈపాటికి?"

పకపకా నవ్వారిద్దరూ ఇసుకలో గీతలు గీసుకుంటూ కూర్చున్నారు కొంతసేపు

"సరే నాకు సమాధానం వచ్చేసరికి ఎంత కాలం పడుతుందేమిటి?"

"నిరీక్షణలోనే ఆనందం వుంటుంది కదా!"

"సరే చీకటి పడుతోంది. ఇక లేద్దామా" అన్నాడు గోపాలం కృష్ణవేణి లేచింది.

"మళ్ళీ ఎప్పుడు దర్శనం?" అడిగింది

"మీరెప్పుడు కావాలంటే అప్పుడు" అని యిద్దరూ కలసి కొంత దూరం వరకూనడిచి తరువాత ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. ఆరోజు కృష్ణవేణి మరికొంచెం దగ్గరయినట్టుగా అనిపించింది గోపాలానికి. ఆ రాత్రి చాలాసేపటివరకు కృష్ణవేణి గోపాలాన్ని గురించే ఆలోచించింది గోపాలం తనవాడయితే జీవితం ఎంతో హాయిగా గడిచిపోతుందనిపించింది. ఆశల పూలపాన్పుపై కలలు కంటూ కమ్మగా నిదురలోనికి ఒరిగిపోయింది.

* * *

మేడమీద తనగదిలో చదువుకుంటోంది కృష్ణవేణి.

"కృష్ణా! చదువుకుంటున్నావా తల్లీ!" అనుకుంటూ అక్కడికి వచ్చారు రామచంద్రరావుగారు

"అవును నాన్నా! రేపు ప్రాక్టికల్సు వున్నాయి. అందునుంచి కొంచెం ప్రిపేరవుతున్నాను" అంది.

"సరే. తరువాత వస్తానయితే చదువుకో." అంటూ లేచిపోబోయారు. "ఏం నాన్నా?" కంగారుగా అడిగింది కృష్ణవేణి

"తరువాత చెపుతాలే అమ్మా"

"ఫరవాలేదులెండి నాన్నా! ఇవి నాకుబాగా టచ్ వున్నవే ఉట్టినే మరోసారి చదువుకుంటున్నాను. ఎందుకైనా మంచిదని" అన్న కృష్ణవేణి మాటలు విని మళ్లీ కుర్చీలో కూర్చున్నారు, కొంతసేపు అవీ యివీ మాట్లాడిన తరువాత "ముఖ్యంగా నీకో విషయం చెప్పాలనే వచ్చాను" అని చేతిలో వున్న పుస్తకంలోంచి ఓ కవరు తీసి ఆ కవరులోంచి ఓ ఫోటోనితీసి, "ఇటు చూడమ్మా ఈ కుర్రవాడు ఎలా వున్నాడో చూడు" అనే సరికి కృష్ణవేణి గుండెఝల్లుమంది. తండ్రి చూపెడుతున్న ఫోటోని చూసి, చేతిలోకి తీసుకోకుండానే "ఎవరిది నాన్నా ఈ ఫోటో" అంది.

## రాద్ధాంతం

— మిరియాల రామకృష్ణ

ఎవరూ చూడని చోట
అంతా నగ్నం
ఎవరూ తిరగని తోట
అంతా అరణ్యం
ఎవరూ మాటాడని ఇంట
అంతా నిశ్శబ్దం
ఎవరూ వినని గదిలో
అంతా రహస్యం
ఎవరూ కదలని బాటలో
అంతా జడత్వం
ఎవరూ తిట్టని పాలనలో
అంతా అధర్మం.

"సరిగా చూసి చెప్పమ్మా. ఎలా వుందో. తరువాత చెప్తాను." అని ఫోటోను కూతురి చేతికందించారు కృష్ణవేణి విధిలేక తండ్రి చేతుల్లోంచి తీసుకున్న ఫోటోను చూసింది కాని — ఆమె ఫోటోను సరిగా చూడలేకపోయింది. తీవ్రమైన తుఫాను ఆమెలో చెలరేగటం మొదలయింది. కొంతసేపటివరకూ సమాధానం చెప్పలేకపోయింది.

"ఏమ్మా? ఎలా ఉన్నాడు?" అని అడుగుతున్న తండ్రి (వ<కేం జవాబు చెప్పాలో కృష్ణవేణి కర్థం కాలే పూర్వాపరాలు తెలియకుండా 'బాగుంది' అనటం ప్రమాదమే కొట్టవచ్చినట్లున్న అందమైన ఫోటోను చూసి బాగులేదనటం అంత బాగుండదేమో అనిపించింది ఇలా ద్వైదీభావంతో సంఘర్షణ పడుతోన్న కృష్ణవేణి, తండ్రి మళ్లీ ప్రశ్నించేసరికి, "బాగానే ఉన్నాడు నాన్నా!" అంది. రామచంద్రరావుగారి ముఖం ఆనందంతో వికసించింది ఫోటోను టేబిలుమీద పడేసింది కృష్ణవేణి

"ఈ అబ్బాయి కాకినాడలో మెడిసిన్ చదువుకుంటున్నాడమ్మా చాల తెలివైన వాడు మంచివాడు అందమైన వాడని నేను చెప్పనక్కరలేదు ఫోటోయే చెపుతోంది నీకు అన్ని విధాలా సరిపోతాడు. అబ్బాయి కూడా నీ ఫోటోను చూసిన వెంటనే ఇష్టపడ్డాడు" అన్నారు పోలీసు ఆఫీసరు హుందాలో మీసాన్ని నులుపుతూ

మనసులో ఆవేదనని ఆరాటాన్నీ బయట పడనీక "ఇప్పుడేం తొందరొచ్చింది నాన్నా నాకు నే నింకా చదువుకోవాలనుకుంటున్నాను" అన్న కృష్ణవేణి మాటలు పూర్తి కాకుండానే "సరిగ్గా అబ్బాయి కూడా యిలానే అన్నాడమ్మా మెడిసన్ పూర్తయాక కాని చేసుకోనన్నాడు. అయినా సంబంధం అంటూ కుదిరిపోయి, పసుపు కుంకాలు యిచ్చుకుంటే ఆపై పెళ్లి ఎప్పుడు చేసినా ఫరవాలేదు కదా! అంటే అబ్బాయి దానికి మాత్రం యిష్టపడ్డాడులే మంచిది. చూసు కొని ఓసారి పిల్లని చూడటానికి వస్తానన్నారు" అప్పుడే వస్తున్న రాజ్యలక్ష్మమ్మ నుద్దేశించి అన్నారా చివరి మాటలు

"అబ్బాయి చక్కగా ఈడౌతాడండీ అమ్మాయికి చూడముచ్చటగా ఉన్నాడు." తల్లి మాటలు కూడా వింటుంటే కృష్ణవేణి వేంచేయాలో పాలుపోలేదు

"అయినా ఇప్పట్నించీ ఎందుకమ్మా ఈ ప్రయత్నమంతా నాకిప్పుడేం కొంప మునిగిపోయిందని?" కొంచెం చిరాకుగా అంది.

"చూడు కృష్ణా! పిల్లలకి ఏ వయసులో ఏ ముచ్చటలు తీర్చాలో ఏ పనులు చేస్తే బాగుంటుందో అన్నీ మాకు తెలుసు. ఎంత చదువుకున్నా, తెలివైన వాళ్ళయినా పండితులు, స్త్రీలు ఆశ్రయ రహితంగా రాణించ

# వెలుగుబాట

లేరని మనవాళ్లు ఊరకనే చెప్పలేదు. పైగా ఆఖరి పిల్లవు. ఈ వయసులో నువ్వు ముచ్చటగా అల్లుడిలో హాయిగా వుండి, చిలకాగోరింకల్లా మీరుంటే ఆ ఆనందం మాకు కాక ఇంకెవ్వరికి చెందుతుంది ?'' తండ్రి మాటలు తనకు భయోత్పాతాన్ని కల్గించాయి.

తల వంచుకుని మారు మాటాడకుండా వూరుకుంది కృష్ణవేణి. కొంతసేపు కాబోయే అల్లుడి గురించి భార్యతో రామచంద్రరావు గారు ఎంతగానో పొగుడుతుంటే, అవన్నీ వినలేక తల బ్రద్దలైపోతున్నా గత్యంతరం లేక ఊరుకుంది కృష్ణవేణి. కూతురి ముఖంలో కమ్ముకున్న విషాదచ్ఛాయల నేమాత్రం గుర్తించకుండా చెప్పకుపోతున్నా రతను. రాజ్యలక్ష్మికి మాత్రం కూతురి ముఖంలోకి చూస్తుంటే అనుమానం, భయం కలిగాయి ఒక్కసారిగా. తండ్రి మేడదిగి వెళ్లిపోతుంటే భారంగా రెండు చేతులలో తలను పట్టుకుంటున్న కృష్ణవేణిని చూసి ''ఏం కృష్ణా! తలనెప్పిగా ఉందా ? అలా కణతలు రాసుకుంటున్నావేం ?'' అని ప్రశ్నించింది రాజ్యలక్ష్మమ్మ

కృష్ణవేణి జవాబు యివ్వలేదు రాజ్యలక్ష్మి కూతురి నుదిటి మీద చెయ్యివేసి ''ఏమ్మా! అమృతాంజనం తెచ్చి వ్రాసేదా?'' అంది

''అక్కర్లేదు నాకేం తలనొప్పి లేదు'' కోపంగా అంది అని తల్లి ముఖంలోకి చూస్తూ, ''అమ్మా. నాకీ పెళ్లి యిష్టం లేదు'' కృష్ణవేణి మాటలు విన్న రాజ్యలక్ష్మి అదిరిపడింది ''ఏం ? ఏమైంది ? ఎందుకిష్టంలేదని ?'' వరుసగా ప్రశ్నించిందామె కృష్ణవేణిని

''పెళ్లి చేసుకునేదీ, జీవితం గడపాల్సిందీ, సుఖపడాల్సిందీ నేను అలాటప్పుడు నా యిష్టాయిష్టాలు ఏవీ కనుక్కోనవసరంలేదా?'' తండ్రిముందు నోరెత్తి మాటాడలేని కృష్ణ తల్లిని గట్టిగా అడిగింది.

''ఏమిటే నీ యిష్టాయిష్టాలు ? - నీ ఇష్టానికి వ్యతిరేకంగా ఇప్పుడేమయిందని ? ముందుగా నీకు అబ్బాయి గురించి చెప్పకుండా పెళ్లి ఇప్పుడే ఏం చేసెయ్యలేదు కదా ?''

''ఏమైనా ఈ పెళ్లి నేను చేసుకోను'' ఆ మాట కృష్ణవేణి నోటినుండి వస్తుండగానే, కృష్ణవేణి చంప ఛెళ్లుమంది. కృష్ణవేణి తెల్లని నునుచెక్కిలి ఎర్రగా కుంకుమ పూసినట్లయిపోయింది కన్నీళ్లు టపటపమని ముందున్న పుస్తకంమీద పడ్డాయి రాజ్యలక్ష్మమ్మకు ఆ క్షణంలో కూతురుని ఏం చేసినా పాపం లేదనిపించింది ''ఈ మాట నా దగ్గరన్నావు సరిపోయింది ఇదే మీ నాన్న అయి వుంటే, ఈపాటికి నీ ప్రాణం తీసి ఉండేవారు పిచ్చి పిచ్చి వేషాలేయక చెప్పినట్లు విన్నావో సరి లేదా? పీక పిసికి అవతల పారేస్తాను. పీడావిరిగిపోతుంది'' మనసులోంచి దుఃఖం పొంగి వస్తుంటే అంది రాజ్యలక్ష్మమ్మ

''ఆ పని నీ చేత్తోనే చేసెయి. మరి నాకే బాధా వుండదు''

''నోర్మూయ్ లలిగా వాగకు బుద్ధిగా చదువుకుని చెప్పినట్లు నడుచుకో'' అంటూ యింకా అక్కడ నిలబడితే కూతురు మంచి వచ్చేసమాధానానికి, ఆవేశంలో తనేంచేస్తుందో కూడా తెలియని స్థితిలో క్రిందికి దిగిపోయింది రాజ్యలక్ష్మి కృష్ణవేణి చంప తడుముకుంది కళ్లనుండి ఆనకోకుండా ప్రవహిస్తున్న కన్నీటిని తుడుచుకుంటోంది. తలుపు గడియవేసి, లైటార్పి మంచంమీద వెల్లకిలా పడుకుంది గదినిండా చీకటి మనసునిండాభయం. బుర్రనిండా ఆలోచనలు

తనకి తెలుసు!

ఈరోజెప్పుడో వస్తుందని! అలాటి రోజున తనలో సెగతుపాను చెలరేగుతుందని! అయితే ... అలాటప్పుడేం చేయాలో తనాలోచించలేదు

ఇప్పుడేం చేయబోతున్నా ముందు ధైర్యం కావాలి!

ఒడుగుతున్న మార్పును తట్టుకోగలిగే స్థైర్యం కావాలి!

పట్టుదల కావాలి! ప్రశాంతత కావాలి! మంచి యోచన కావాలి!

''ఇది యావజ్జీవిత సమస్య దీని మీద తన భవిష్యత్తంతా ఆధారపడివుంది. ఈఒక్క విషయంలో తొందర పడినా, పిరికితనంతో తల ఒగ్గినా తను జీవితాంతం కష్టాల సుడిగుండాలలో తలమునకలవక తప్పదు!''

తను నిర్మించుకున్న బాటలో జీవితాన్ని గురించి ఆలోచించింది కొన్ని చిక్కులు కనిపించినా, అవి తొలగిపోయేవిలా కనిపించాయి

(38వ పేజీ చూడండి)




# హార్ట్ స్పెషలిస్ట్

వీరభద్రరావు పమ్మి

నేను క్యాంప్ నుంచి తిరిగొచ్చి కంపెనీ కెళ్లేసరికి బాగా ఆలస్యమైంది వెళ్లగానే నా అసిస్టెంట్ చెప్పాడు

"శంకరంగారు మీకోసం రెండుసార్లు ఫోన్ చేసారు" అని

వెంటనే నే నాయనకు రింగ్ చేసాను

"మై బోయ్! నీతో అర్జంటుగా మాట్లాడాలి — నీ రూం కొస్తున్నాను" అన్నారు

"ఒద్దులెండి సార్! నేనే మీ దగ్గర కొస్తాను మీ ఫ్లాస్కులో బోర్నవిటా తాగి చాలా కాలమైంది" అన్నాను నవ్వుతూ

"ఒ కే వెల్కం" అన్నారాయన

శంకరంగారు నాలాగే మా కంపెనీలో మరో ఆఫీసర్ వయస్సులో మాత్రం నాకంటె బాగా పెద్దవాడు అసిస్టెంట్‌గా జీవితం ప్రారంభించి ఎన్నో కంపెనీల్లో పనిచేసి ఇప్పటికి ఆఫీసరయ్యారాయన నాలాటి డైరెక్ట్ రిక్రూట్సంటే వాళ్ళకు అసూయతో కూడిన దురభిప్రాయం వుంటుంది మేము తొందరపడి నిర్ణయాలు తీసుకుంటామని అన్నీ యీజీగా తీసుకుంటామని, ఒళ్ళొంచి పనిచేయమని వాళ్ళ నమ్మిక అలాగే ప్రమోటెడ్ వాళ్ళంటే "ఛాందసులని" మా వాళ్ళ ఆలోచన కాని శంకరం గారలాటి మనిషి కాదు

నేను ఢిల్లీనుంచి ట్రాన్స్‌ఫరై వచ్చిన మూణ్నెలల్లోనూ నాకు ఆయనతో బాగా స్నేహమయ్యింది

నేను వెళ్లి బోర్నవిటా తాగడం పూర్తయ్యాక ఆయనకు మామూలుగానే సిగరెట్ ఆఫర్ చేసాను

కాని ఆయన సమాధానానికి నేను ఉలిక్కిపడ్డాను విపరీతంగా సిగరెట్లు తాగే ఆయన ఎందుకంత సడెన్‌గా స్మోకింగ్ మానేసారో నా కర్థం కాలేదు ఆయన్నే అడిగాను

"అది చెప్పడానికే నిన్ను అర్జంటుగా కాంటాక్ట్ చేసాను రెండు రోజుల క్రితం నాకు గుండెనొప్పి వచ్చింది" నేను చాలా ఆదుర్దా పడ్డాను

ఆయన మాత్రం చాలా ధైర్యంగా కనిపించారు

"ఏమీ కంగారు పడక్కర్లేదు డాక్టర్ని కలిశాను ఏవో మందులు రాసిచ్చాడు ఎందుకైనా మంచిది ఓసారి స్పెషలిస్ట్‌ని కలవమన్నాడు ఉస్మానియాలో ఒకామె వుందట ఆమెకు లెటర్ రాసిచ్చాడు ఈవేళ సాయంత్రం వెడదామనుకుంటున్నాను నువ్వుకూడా వస్తే ధైర్యంగా వుంటుంది" అన్నారు

ఆయనంత ధైర్యంగా చెప్తున్నా — నా ఆందోళన మాత్రం తగ్గలేదు

"సాయంత్రం ఎందుకూ? ఇప్పుడే వెడదాం!" అన్నాను

"ఆవిడ సాయంత్రాలు ఇంటిదగ్గరుంటుంది— పంజాగుట్టలో ఆమె యిల్లు అడ్రస్ తీసుకున్నాను"

"ఎవరావిడ?"

"డాక్టర్ రాధిక"

వెంటనే నాకు మా రాధిక గుర్తుకొచ్చింది ఒకవేళ డాక్టర్ రాధిక ఇక్కడే వుందేమో? నేను ఢిల్లీనుంచి హైదరాబాద్‌కి వచ్చిన తర్వాత ఎప్పటికప్పుడు ఆమె ఎడ్రస్ తెల్సుకుని కలవాలనుకుంటూనే గడిపేశాను ఒకవేళ శంకరంగారు చెప్పే హార్ట్ స్పెషలిస్ట్ ఆవిడే అయితే? రాధికను కలవబోతున్నందుకు చాలా సంతోషమనిపించింది

* * *

రాధిక నాకు నాలుగేళ్ల క్రితం పరిచయమయ్యింది ఓ రోజు నేను, నారాయణ కల్సి ఉస్మానియా మెడికల్ కాలేజీకి మెడికల్ ఎగ్జిబిషన్ చూడటానికెళ్ళాం చాలాసేపు అక్కడ అన్నీ చూస్తూ తిరిగాం పై అంతస్తులో పెద్ద హాలు వుంది అందులో గుండెకు సంబంధించిన విషయాలన్నీ సూచించే ఛార్టులు, మోడల్స్ వగైరా అమర్చారు హార్ట్ కంప్లైంట్ ఎందుకొస్తుందో, ఆ జబ్బుని ఎలా గుర్తించాలో ఏ జాగ్రత్తలు తీసుకోవాలో వివరంగా చెపుతోంది రాధిక నాకు రాధిక తీసుకునే శ్రద్ధ, ఓపిక చూస్తే చాలా ముచ్చటేసింది అక్కడే ఎక్కువసేపు నిలబడిపోయాం చివర్న ఆమెకు థాంక్స్ చెప్తూ —

"మీ పేరు తెలుసుకోవచ్చా!" అనడిగాను ఇంగ్లీషులో

"రాధిక" తియ్యగా సమాధానమిచ్చింది

రాధిక అందంగా, సింపుల్‌గా వుంటుంది ఆమె చక్కటి ఇంగ్లీషులో మాట్లాడుతుంది ఎదుటివారి ప్రశ్నలకు సమర్థవంతంగా జవాబులిస్తోంది ఆమె హాయిగా మాట్లాడగలదు అందంగా నవ్వగలదు

తర్వాతెప్పుడు రాధిక నాకు జ్ఞాపకంరాలేదు కొన్నెళ్ల తర్వాత నేను డాక్టర్ నిరంజన్ పెళ్లికెళ్ళాను ఆయన నాకు మంచి స్నేహితుడు అందుకని ముందుగానే నేను ఏర్పాట్లు చూడ్డానికి ఎగ్జిబిషన్ క్లబ్ కెళ్లిపోయాను అక్కడ మళ్లీ నాకు రాధిక కనిపించింది

ఆమెను చూడగానే నేను పోల్చుకున్నాను ఆమె నన్ను గుర్తుపట్టదేమో ననుకున్నాను కాని తనే వచ్చి నన్ను పలకరించింది

పెళ్లికూతురు 'మీరా' ఫైనల్ మెడిసన్ చదువుతోంది

రాధిక, మీరా క్లాస్‌మేట్సట

ఆరోజు మేమెంతో హాయిగా కాలక్షేపంచేసాం

అప్పుడే నాకు, రాధికకు స్నేహం పెరిగింది

ఆమె నన్ను వాళ్ళింటికి రమ్మని ఆహ్వానించింది

ఎప్పటికప్పుడు వాళ్లింటికి వెడదామనుకుంటూనే ఓ నెల గడిపేశాను

ఓ రోజు రాధిక నాకోసం కంపెనీకి ఫోన్ చేసింది

తను నన్ను కలవడానికి వస్తున్నట్టు, ఆఫీసులో వెయిట్‌చెయ్యమని చెప్పింది

ఓ అరగంట తర్వాత రాధిక మరొకతన్ని తీసుకుని నాదగ్గర కొచ్చింది అతను తన స్నేహితుడు కృష్ణగా నాకు పరిచయంచేసింది అతను సిటీలోనే ఓ హైస్కూల్లో బి ఇడి టీచర్‌గా పనిచేస్తున్నాడు

కృష్ణ బాగా సాత్వికుడు, నెమ్మదస్తుడు మర్యాదస్తుడుగా నాక్కనిపించాడు అతను తక్కువ మాట్లాడతాడు

ముగ్గురం 'కామత్' హోటల్లో కూర్చున్నాం

కాఫీ ఆర్డర్‌చేసాక వాళ్ళొచ్చిన విషయం కృష్ణే చెప్పేడు

# హార్ట్ స్పెషలిస్ట్

"రేపు రాధిక పుట్టినరోజు కొద్దిమంది స్నేహితుల్ని పిల్చి మా యింట్లో పార్టీ ఇస్తున్నాను మీరు తప్పక రావాలి"

మర్నాడు పార్టీ కెళ్ళాను రాధికకు మంచి పెన్ బహూకరించాను నేను పార్టీ కెళ్ళినందుకు యిద్దరూ ఎంతో సంతోషించారు నేనుకాకుండా వరో పాతికమందిదాకా పార్టీకొచ్చారు అందులో మెడిసన్ చదివేవాళ్ళు ఎక్కువమంది వున్నారు వాళ్ళంతా ఏదో వాళ్ళ కాలేజీ గొడవలు మాట్లాడు కుంటున్నారు ఏర్పాట్ల హడావుడిలో వున్న కృష్ణ రాధికను పిల్చి నాకు కంపెనీ యిమ్మని చెప్పాడు

రాధిక ఎన్నో కబుర్లు చెప్పింది

ఆమెకు చిన్నతనంలోనే తండ్రి పోయాడు చాలా కష్టాలుపడి తల్లి ఆమెను చదివించింది రాధిక మొదట్నుంచీ చదువులో శ్రద్ధ చూపించింది ఆమెకు ప్రతి సంవత్సరం మెరిట్ స్కాలర్‌షిప్పు లొచ్చేవి రాధిక ఎలాగైనా డాక్టరు కావాలని ఎన్నో కలలుకంది అందుకు తల్లికూడా ఒప్పుకుంది

వాళ్ళూళ్ళో వున్న యిల్లొకటి అమ్మేసి వాళ్ళు హైదరాబాద్ వచ్చేసారు ఆమెకు సీటంటూ వచ్చిందికాని, ఆర్థికంగా తట్టుకోలేకపోయింది ఆమెది డబ్బుతో ముడిపడ్డ చదువు అసలే వాళ్ళ ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రం

ఆమె రెండో సంవత్సరం చదువుతుండగా కృష్ణ ఆమెకు పరిచయం అయ్యాడు వాళ్ళ పరిచయం స్నేహంగా మారింది అతనిలోని మంచితనం, నిర్మలత్వం ఆమెను ఆకర్షించాయి ఆమెలోని ఉత్సాహం, పట్టుదల అతనికి నచ్చాయ్ వాళ్ళిద్దరూ మంచి స్నేహితులయ్యారు రాధికకు కావల్సినప్పుడల్లా అడగకుండానే కృష్ణ ఆర్థికంగా సహాయపడుతుండేవాడు అతనికి పెద్దగా బాధ్యతలేమీ లేవు తన సంపాదనలోనే పొదుపుచేసి - ఆమెను ఆదుకుంటూండేవాడు ఇంకా చాలక సైకిల్‌మీద తిరిగి ట్యూషన్ చెప్తూండేవాడు

ప్రస్తుతం ఆమె మంచి చెడ్డలు, అవసరాలు అతనే చూస్తూంటాడు ఆమెక్కావల్సిన మనో ధైర్యాన్ని, ఉత్సాహాన్ని అందిస్తూంటాడు

ఇవన్నీ చెప్పాక రాధిక అంది

"మా ఇద్దరికీ ఏదో పూర్వ జన్మానుబంధం వుందనిపిస్తుంది విజయ్ నే నెప్పుడేనా అతన్ని అడగడాన్కి మొహమాట పడితే నా అవసరాలు ఏమిటో గ్రహించుకుని తనే సాయం చేస్తాడు ఇంత చేస్తున్నాడు కదా — అతను నానుంచ ఏమాశిస్తున్నాడా -- అని ఆలోచిస్తే ఏమీ కనబడదు అదే ఎప్పుడేనా అతన్నడిగితే—"నువ్వంటే న కిష్టం రాధీ" అని మాత్రం అంటాడు అతనే కనక నన్ను ఆదుకోకపోయినట్టయితే నా చదువేనాడో ఆగిపోయేది అంతేకాక నా జీవితం దారి తెలియని పడవలాగ అయ్యేది —

ఇంతకీ అసలు విషయం మీకు చెప్పనేలేదు నాకు అతను చేసిన సహాయానికి కృతజ్ఞతగా - మనస్సు అతనికి అర్పించాను మే మిద్దరం పెళ్లి చేసుకోబోతున్నాం" ఆ మాటలు చెప్పేటప్పుడ మాత్రం ఆమె ముఖం సిగ్గుతో ముడుచుకుపోయింది

మళ్లీ తనే చెప్పడం మొదలెట్టింది

"నేనేం చేసినా అతని ఋణం తీరదు విజయ్‌గారూ! అతనికి జీవితంలో కష్టమంటే ఏమిటో తెలియకుండా చూసుకుంటాను అత జీవితానికి పూలపాన్పు వేసి సుఖపెడతాను ఈ మాట కృష్ణతో అంటే ఏమన్నాడో తెలుసా!

'రాధీ! నువ్వేలాగా డాక్టర్ కాబోతున్నావ్ నేనా మామూలు టీచర్‌ని నువ్విలాటి నిర్ణయం తీసుకునేముందు ఒకటికి రెండుసార్లు ఆలోచించు కోవడం మంచిది'

అతనలా అన్నాక లతనిమీద గౌరవం పెరిగిం దండీ! నా చదువు పూర్తి కాగనే మేమిద్దరం పెళ్లి చేసుకుంటాం" ఎంతో ఆనందపడిపోతూ ఈ విషయాలన్నీ చెప్పింది

ఆమె ఉరుకులు పరుగులతూ వేసే జలపాత మైతే లతను నిర్మలంగా, స్వచ్ఛంగా పారే నది లాంటివాడు విభిన్నమైన స్వభావాలు కలవారు ఇద్దరూ అయినా నిర్మలమైన మనస్సుంది ఇద్దరికీ అంతకన్నా ఏం కావాలి దంపతులుగా వాళ్ళు సుఖ పడటానికి? రాధిక ఈ విషయాలన్నీ చెప్పాక కృష్ణంటే గౌరవం అభిమానం పెరిగాయి నాకు

కృష్ణ, రాధికలతో నాకు స్నేహం బాగా పెరిగింది ఎక్కువగా కల్సుకుంటూండేవాళ్లం శలవురోజుల్లో సినిమాలకు, షికార్లకు, పిక్‌నిక్‌లకు తిరుగుతుండేవాళ్లం ఒకరికొకరు పార్టీలు, డిన్నర్లు యిచ్చుకుంటూండేవాళ్లం

ఇలా ఓ ఆర్నెల్లపాటు గడిచిపోయింది ఇంతలో నాకు ప్రమోషన్‌మీద ఢిల్లీ ట్రాన్స్‌ఫ రైంది నేను ఢిల్లీ వెళ్లిన మొదట్లో కృష్ణ, రాధిక నాకు తరచు ఉత్తరాలు రాస్తూండేవాళ్లు నేను జవాబు లిస్తూండేవాణ్ని తర్వాత మెల్లి మెల్లిగా యీమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు ఆగి పోయాయి వాళ్లిద్దరూ ఎలావున్నారో తెలియలేదు నాకు ఎప్పుడేనా గుర్తువస్తే వాళ్లిద్దర్ని తల్చు కుంటూండేవాణ్ని

ఓసారి మాత్రం ఓ మిత్రుడు ఢిల్లీలో కనిపించి రాధిక ఎం డి చేస్తున్నట్టు చెప్పాడు

* * *

సాయంత్రం ఆరుగంటలైంది పట్టణాన్ని చీకటి ముసురుకుంటోంది రోడ్లన్నీ జనసమ్మర్దంతో గర్వపడిపోతున్నాయ్ ఇళ్లకెళ్లిపోవాలనే ఆత్రంతో జనం బస్సుల్లో వేళ్ళాడుతూ మరీ పోతున్నారు పైకి కనబడని గాభరాను తనలోనే దాచుకుని శంకరంగారు ఆటోలో నా ప్రక్కనే కూర్చున్నారు నా మనస్సులో మాత్రం రాధిక, కృష్ణ మెదుల్తున్నారు వాళ్లిద్దరూ నన్ను చూసి ఆశ్చర్యపడతారు అంతకు మించి ఆనందపడతారు

ఆటో పంజాగుట్టలో ఓ ఆకుపచ్చ రంగుగల చిన్న మేడ ముందాగింది గేటు పక్కగా గోడమీద 'రాధికా విలాస్' అని పాలరాతిమీద రాసివుంది గోడ మధుగా పెకాల మరో పెద్ద బోర్డు వుంది అక్కడ పెద్ద పెద్ద అక్షరాలతో

డాక్టర్ విశ్వనాథ్ ఎమ్ డి

డాక్టర్ రాధిక ఎమ్ డి అని వుంది

ఆ బోర్డు చూసి నేను కాస్త ఆశ్చర్యపోయాను అంతలోనే మరో ఆలోచన వచ్చింది ఒకవేళ రాధిక డాక్టర్ విశ్వనాథ్ అనే ఆయనతో కల్సి ప్రాక్టీస్ చేస్తోందేమో? అంతలోనే మళ్లీ నాకు సందేహం వచ్చింది ఒకవేళ ఆ రాధిక, ఈవిడ ఒకటి కాదేమోనని

## శ్రీ కాళేశ్వర క్షేత్రోద్ధరణ: ఒక విజ్ఞప్తి

శ్రీ కాళేశ్వర క్షేత్రోద్ధరణకోసం ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంవారు చేపట్టిన కార్యక్రమాలలో జీర్ణోద్ధరణ నిధి సేకరణ ఒకటి కొంత కాలం కింద 'ఆంధ్రపత్రిక' శ్రీశైల క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి సేకరణలో పాలుగొని కొంత మొత్తం వసూలుచేసి ఆ నిధిని సమర్పించిన సంగతి పాఠకులకి తెలుసు అదే విధంగా శ్రీ కాళేశ్వర క్షేత్రోద్ధరణ నిధి సేకరణలో కూడా 'ఆంధ్రపత్రిక' పాలుగొనాలని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు సూచించారు వారి సూచన ప్రకారం శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి కోసం చందాలు వసూలు చెయ్యటానికి 'ఆంధ్రపత్రిక' పూనుకొంటున్నది దాతలు తమ విరాళాలను ఈ క్రింద సూచించిన చిరునామాలకి శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి పేర పంప ప్రార్ధన పది రూపాయలకి మించిన విరాళాలు పంపిన దాతల పేరు 'ఆంధ్రపత్రిక' దినపత్రికలో ప్రచురింపబడుతాయి అంతేగాక వారికి రసీదులు పంపబడుతాయి భక్తులందరూ యీ పవిత్ర కార్యక్రమంలో పాలుగొని దాన్ని జయప్రదం చెయ్యగలరని నమ్ముచున్నాము

విరాళాలు ఈ క్రింద ఇచ్చిన చిరునామాలలో దేనికైనా అందచేయవచ్చు

**శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి,**
**కేరాఫ్ ఆంధ్రపత్రిక**
**బషీర్‌బాగ్, హైద్రాబాద్-500029**

లేక

**శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి,**
**కేరాఫ్ ఆంధ్రపత్రిక గాంధీనగర్**
**విజయవాడ — 520003**

లేక

**శ్రీ కాళేశ్వర క్షేత్ర జీర్ణోద్ధరణ నిధి,**
**కేరాఫ్ ఆంధ్రపత్రిక**
**72 తంబుచెట్టి వీధి,**
**మదరాసు - 600001**

**సంపాదకుడు,**
ఆంధ్రపత్రిక

గేటు తీసుకుని లోపలికెళ్ళాం మేడముందు విశాలమైన స్థలం వుంది

మధ్యగా లాన్స్‌లో నాలుగు సిమెంటు బెంచీ లున్నాయి లాన్స్ మధ్యలో ఓ మెర్క్యురీదీపం అందంగా వెలుగుతోంది చుట్టూ చాలా రకాల పూలమొక్కలున్నాయి గేటు దగ్గర్నుంచి మేడ దగ్గరికి పోవడాన్కి నాపరాళ్ళు చపటా వుంది మేడకు ముందుభాగంలో ఓ పెద్ద హాలు వుంది అక్కడున్న బెంచీలనిండా జనం వున్నారు మేమక్కడకు వెళ్ళాక ఒకతను వచ్చి డాక్టర్‌గార్ని చూడ టానికి మరో అరగంట పడుతుందని వెయిట్ చెయ్యమని చెప్పాడు అతను అక్కడ అసిస్టెంట్‌గా పన్జేస్తున్నాడు మెల్లగా అతన్ని మాటల్లో దించాను అతని మాటల్నిబట్టి డాక్టర్ విశ్వనాథ్, డాక్టర్ రాధిక దంపతులేనని తెల్సింది

మరైతే ఆమె — ఈమె ఒకరు కారా ?

లేక రాధిక కృష్ణను పెళ్లి చేసుకోలేదా ?

కాస్సేపట్లో డాక్టర్ రాధికను చూస్తాను కదా — అన్ని విషయాలు తెలుస్తాయి అనుకుంటు న్నానే కాని — ఆలోచించకుండా వుండలేకపోయాను

నేను, శంకరంగారు కన్సల్టింగ్ రూంలో కెళ్ళాం

కుర్చీలో కూర్చున్న డాక్టర్ రాధిక వెంటనే నన్ను గుర్తుపట్టింది

"హల్లో విజయ్ ! ఎప్పుడొచ్చారు ? ఏమిటి విశేషాలు?" ముఖమంతా నవ్వు నింపుకుని అడిగింది

రాధిక కాస్త వళ్లొచ్చినట్టు కనిపిస్తోంది కళ్లజోడు పెట్టుకోడంవల్ల మనిషిలో కొద్దిగా మార్పు కనిపిస్తోంది

"నేను హైద్రాబాద్ వచ్చి మూడు నెల లయ్యింది" అన్నాను

"వ్వాట్ ! మూడు నెలలుగా హైద్రాబాద్‌లో వుంటూ నన్ను చూడటానికి రాలేదా ! రియల్లీ పిటీఫుల్" అంది నొచ్చుకుంటూ

నేనామెను ఏ కారణాలవల్ల కలవలేకపోయానో వివరించి చెప్పాను కాస్సేపు యిద్దరం కబుర్లు చెప్పుకున్నాం నేను తిరిగి హైద్రాబాద్ ట్రాన్స్‌ఫరై వచ్చినందుకు చాలా ఆనందించింది రాధిక

నేను శంకరంగార్ని ఆమెకు పరిచయంచేసి వచ్చిన పని చెప్పానామెకు

శంకరంగార్ని పరీక్షచేసి — ఏమీ ఆందోళన పడనక్కరలేదని, నీరసంమీద వచ్చిన నొప్పి యని చెప్పింది వారంరోజులు పోయాక మళ్లీ రమ్మన మని చెప్పింది

ఏవో మందులు రాసిచ్చి, విశ్రాంతి తీసుకో మని చెప్పింది

నేనామెతో మాట్లాడుతున్నానన్నమాటేకాని— మనస్సంతా కృష్ణమీదే వుంది

కృష్ణ గురించి ఆమెను అడిగితే ?

అది సమయం కాదనిపించింది

వెడతామని చెప్పి లేచాం

"అన్నట్టు విజయ్‌గారూ ! రేపోసారి రాకూడదు ఎలాగూ ఆదివారంకదా ఖాళీగానే వుంటాను సరదాగా కాస్సేపు కబుర్లు చెప్పు కుందాం" అంది

సరే వస్తానని చెప్పి ఇంటికి వచ్చేసాను

మర్నాడు మధ్యాహ్నం మూడు గంటలకు మళ్లీ రాధిక యింటికి వెళ్లాను

మేడమీద కెళ్లేసరికి నన్ను సోఫాలో కూర్చోమని చెప్పి రాధికను పిలవడానికి లోపలి కెళ్లింది ఓ పనిపిల్ల

"మీకోసమే ఎదురుచూస్తున్నాను" అంది ఆదరంగా రాధిక

మేమిద్దరం మాటల్లో పడ్డాం ఓ ప్లేటు నిండా పళ్లముక్కలు, బిస్కెట్లు తెచ్చిపెట్టింది పనిపిల్ల

కాస్సేపు ఢిల్లీ కబుర్లు, తన ప్రాక్టీస్ కబుర్లు చెప్పుకున్నాం కూల్‌డ్రింక్సు తాగాం నాకు పెళ్ళయినట్టు చెప్పాను మా ఆవిడను తీసుకు రాలేదని చాలా బాధపడింది

ఇంతలో చటుక్కున తనే అడిగింది

"మీరు నిన్న కృష్ణ గురించి అడుగుదామను కున్నారు కదూ !" అని !

ఆ ప్రశ్న నేను ఊహించలేదు కాని యెలా మొదలుపెట్టాలా అని మాత్రమే అనుకున్నాను

"అడుగుదామనుకున్నమాట వాస్తవమే కాని అది సమయం కాదనిపించి ఊరుకున్నాను ఇంతకీ అసలేం జరిగింది ? ఆయనెక్కడున్నారు" ఎటో చూస్తూ అడిగాను




ఆమె ఏం చెప్తుందో వినడాన్కి కుతూహల పడ్డా, ఏం చెప్పినా వినడాన్కి సిద్ధపడ్డాను

"నేను ఎం బి బి ఎస్ క్లాసులో ప్యాస య్యాను స్కాలర్‌షిప్పుతోసహా ఎం డి సీటొ చ్చింది ఎన్నాళ్లగానో నాకు హార్ట్ స్పెషలైజ్ చెయ్యాలని వుంది కాబట్టి ఎం డి చేద్దామని పించింది కృష్ణ సరేనన్నాడు మా పెళ్లి తాత్కాలికంగా వాయిదా వేసుకున్నాం

ఓ సంవత్సరం గడిచేసరికి నా ఆలోచనల్లో నాకే తెలియకుండా ఏదో మార్పు వచ్చింది సంఘం మారుతోంది నేనూ మారుతున్నాను నాగరికత పెరిగింది — నేనూ పెరుగుతున్నాను ఎదుగుతున్న కాలంతోపాటు నేనూ ఎదుగుతున్నాను వీటన్నిటితో పాటు నా ఆలోచన, నా మానసిక స్థితి, నా పరిసరాలు, నాచుట్టూ వుండే మనుష్యులు అన్నీ మారాయి

రాను రాను నేనో విషయం గ్రహించాను

కృష్ణ మాత్రం మొదట్నుంచీ తనెక్కడ వున్నాడో అక్కడే — అదే పాయింట్ దగ్గర వుండి పోతున్నాడు

అలా ఏ విధంగానూ ఎదుగుబొదుగూ లేని మనిషిని, మార్పులేని వ్యక్తిని చేసుకుంటే మేం సుఖపడతామా అన్న ఆలోచన నాకు కల్గింది

నేను డాక్టర్‌గా పెరిగి, హార్ట్ స్పెషలిస్ట్‌గా ఎదిగి ఓ పరిధి దాటి యీవతలి కొచ్చేశాను అతను మాత్రం స్కూలు టీచరుగా అదే పరిధిలో గిరి గీసుకుని వుండిపోయాడు

అప్పటికే నాకు డాక్టర్ విశ్వనాథ్ బాగా తెలుసు ఆయన నా క్లాస్‌మేట్ పైగా ఇద్దరం డాక్టర్లం దంపతులమైతే జీవితంలో ఎంతో సాధించవచ్చనిపించింది

ఒదే నిర్ణయం కృష్ణతో చెప్పాను "నీయిష్టం" అనిమాత్రం అన్నాడు" చెప్పడం ఆపింది

"ఇప్పుడు కృష్ణ ఎక్కడున్నారు ?" కుతూహలంగానే అడిగాను

"విజయవాడలో వుంటున్నాడట కృష్ణ నాకు యెంతో సహాయపడ్డమాట వాస్తవమేకాని యిష్టంలేకుండా అతన్ని చేసుకోవడం ఆత్మవంచన అవుతుందనిపించింది తన ఋణం మరోరకంగా యెలాగైనా తీరుస్తానని తనకేం కావాలన్నా యిస్తానని చెప్పాను అతనేం వద్దన్నాడు"

ఆమె కృతజ్ఞతకు రేటు కటుతోందనిపించి కాస్త కోపం కలిగింది నాకు అయినా నేనేం మాట్లాడలేదు

నేను వెళ్లొస్తానని చెప్పి లేచాను ఎందుకో అక్కడ ఎక్కువసేపు వుండబుద్ధికాలేదు తనూ లేచి నిలబడింది

"అన్నట్టు డాక్టర్ విశ్వనాథ్ ఊళ్లో లేరు మీరు మళ్లీ వచ్చినప్పుడు పరిచయం చేస్తాను చాలా సరదాఅయిన మనిషి యూ విల్ లైక్ హిమ్" అంది

అల్లాగే అని మాత్రం అనగలిగాను

కూడా గుమ్మందాకా వస్తూ అంది

"నిజం చెప్పండి విజయ్ ! నేను చేసింది తప్పంటారా ?"

ఓ క్షణం ఆలోచించి అన్నాను

"రాధికా ! మీరు డాక్టర్ ఆపరేషన్ చెయ్య డంలో వున్న యింటరెస్ట్ పోస్టుమార్టమ్ చెయ్య డంలో వుండదుకదూ !"

చిరునవ్వు నవ్వి వూరుకుంది

మళ్ళీ కలుస్తానని చెప్పి - వచ్చేసాను

మళ్లీ శనివారం వచ్చింది

సాయంత్రం శంకరంగారు నా రూంలో కొచ్చారు

"ఈరోజు డాక్టర్ రమ్మందికదా ! వెడదామా ?" అన్నారు

"సారీసర్ ! నేను రాను మీ రెళ్లిరండి" ఖచ్చితంగా అనేశాను

"అదేం" అనడిగారాయన

"డాక్టర్ రాధిక హార్ట్ స్పెషలైజ్ చేసింది నిజమే ఆమెకు చెడిపోయిన హృదయాలు బాగు చెయ్యడమే తెలుసు నిండుహృదయాల్ని లాలించి పోషించి, పెంచే శక్తి ఆమెకు లేదు ఆమె నిజ మైన హార్ట్ స్పెషలిస్ట్ కాదు" అన్నాను

శంకరంగారు ఏమనుకున్నారో తెలియదు

కాని తలొంచుకుని వెళ్లిపోయారు ●

# కలిమిచ్చిన తీర్పు

## * అన్నపూర్ణ

(గత సంచిక తరువాయి)

కూతురి ఆ జాలిగొలిపే మాటలు విన్నాక సుబ్బరామయ్యా కనులూ సజలమయ్యాయి

"విశ్వం మీద నీ అభిప్రాయ మేమిటమ్మా ?" అనడిగాడు సందర్భం కలిసివచ్చి

" ఎంతో మంచివారు నాన్నా ఆయనది మానవాతీత హృదయమేమో అని అనిపిస్తూంటుంది నాకు అప్పుడప్పుడు ఎప్పుడు కనిపించినా నన్ను చూసి జాలిపడతారు అభిమానంగా మాట్లాడిస్తారు "

"అయినా, అతడి ప్రవర్తనమీద నా కేమిటో అనుమానం కలుగుతోంది అసలు విశ్వాన్ని మన ఇంట్లో తెచ్చిపెట్టుకున్నది దేనికి ? నిన్ను గురించి ! లలాంటిది ఆతడు సుమతో ఎక్కువ చనువుగా ఉంటున్నట్లు తోస్తోంది నాకు "

"నేను మాత్రం ఆయన్ని శంకించలేను నాన్న గారూ ఎప్పుడూ సుమే వెళ్లి విశ్వంగారి దగ్గర కూర్చుంటుంది అతడు బజారుకు బయలుదేరి నప్పుడల్లా ఏదో నెపంపెట్టి నేనూ వస్తానని ఇదే బయలుదేరుతోంది "

"నీ మాట కాదనలేను అయినా ఈ ఒక్క సారికీ నువ్వు నా మాట కాదనకమ్మా ఎక్కడి కక్కడ విశ్వానికి సన్నిహితం కావటానికి ప్రయత్నించు అతడితో చొరవగా మాట్లాడటం అలవాటు చేసుకో మధ్య మధ్య ఏదైనా సినిమాకు, షికారుకు తీసుకువెళ్లమను విశ్వం నిజతత్వం ఎంత తొందరగా తెలిస్తే అంత మంచిది లేకపోతే నీ ఆశలకు, నా తాపత్రయానికీ అర్థం ఉండదు మనం గుడ్డిగా మోసపోకూడదు ఎప్పటికి నువ్వతడి మాటలను, చేష్టలను ఒక కంట కనిపెట్టి ఉండాలి విశ్వం ప్రవర్తన గురించి నాకు ఏనాటి కానాటికి వివరిస్తూండాలి ఒక విధంగా నువ్వతడి ముందు నటించాలమ్మా ఇదంతా కేవలం నీ శ్రేయస్సు కోసమే – నేను చెప్పినట్లు నడుచుకుంటావా సుజా ?"

-- తండ్రి మాటను ఏనాడూ కాదనని సుజాత అప్పుడూ వ్యతిరేకించలేదు

"ఈ వేళ నువ్వు విశ్వాన్ని సినిమాకు తీసుకు వెళ్లమని అడుగు సినిమా నుంచీ వచ్చాక అతడి ప్రతి ఒక్క కదలికను, ప్రతి ఒక్క మాటను, ప్రతి ఒక్క చేష్టను నాకు పూసగ్రుచ్చినట్లు వివరించాలి అలా చేస్తావా సుజా ?"

"అలాగే నాన్నగారూ" అంది

"నిన్ను సినిమాకు తీసుకువెళ్లమని మేం విశ్వానికి చెప్పటం బావుండదు ఆనిక్కి సమయం చూసి నువ్వే అడుగు ఏమంటాడో చూద్దాం "

అలాగే తండ్రి చెప్పినట్లు ఆ మధ్యాహ్నం వీలు కనిపెట్టివెళ్లి విశ్వాన్ని అడిగింది

"పెళ్లికానుక సినిమా యీవేళ్టితో వెళ్లిపోతుందట అదివరకు వచ్చినప్పుడుకూడా చూడ లేదు సుమ చాలాసార్లు చూసింది నాన్నగార్ని అడిగితే సరే వెళ్లమన్నారు తోడు వచ్చేవాళ్లు లేరు పోనీ, మీరు నావెంట రాకూడదూ ?"

"ఓ ఎస్ నిరభ్యంతరంగా" అనేశాడు విశ్వం వెంటనే

తను అడిగిందేతడవు అతడు అంగీకరించటంతో సుజాతలో అనిర్వచనీయమైనదేదో అది సంతోషానికి సంబంధించినదే కావచ్చు కలిగింది

"థాంక్స్ ! అయితే ఫస్టుషోకు రడీ అవుతాను " అని యీమాట ముందు తల్లికి చెప్పాలని లోపలికి వెళ్లింది

"నువ్వు అడిగీ అడగటంతోటే సరే అన్నాడా ?! ఆ మనిషిని ఎలా అర్థంచేసుకోవాలో బోధపడకుండా వుందే ఏదైనా మన జాగ్రత్తలో మనం వుండాలి నువ్వుమాత్రం మీ నాన్నగారు చెప్పినట్లు నడుచుకో సుజా !" అంది సుందరి, పెద్దకూతురు చెప్పింది విని

సాయంత్రం రోజూకంటే ఒక అడుగు ముందె యింటికి వచ్చాడు సుబ్బరామయ్య

విశ్వం సుజాతను సినిమాకు తీసుకువెళ్లటానికి అంగీకరించాడని తెలిసి — తను వేసిన ప్లాను సక్సెస్ అవబోతున్నందుకు సంతోషించాడు అతడు

కాలేజీనుంచి వచ్చిన సుమ, "పెళ్లికానుక సినిమా ఎన్నిసార్లు చూసినా తనివితీరదు నేనూ వస్తాను పదండి బావగారూ !" అంది

కానీ, "రోజూ సినిమాలకు వెళ్లి చదువునేం చేస్తావ్ ?" అని తండ్రి వారించటంతో ఆగిపోయింది

మొదట్నుంచీకూడా తల్లి మాటను చాలా సందర్భాలలో త్రోసిరాజంది కానీ, తండ్రి మాటను ఏనాడూ తీసివేయలేదు సుమ అలాగే యిపుడు మనసులో తన అక్కమీద ఈర్ష్యలాంటిది ఏదో రగులుకొంటూ — ఆవేదనలాంటి దేదో అనుభవిస్తున్నా సుబ్బరామయ్య మాటకు ఎదురు చెప్పలేకపోయింది

"వెళ్లేటప్పుడు జీపులో వెళ్లండి వచ్చేటప్పుడు ఏ ఆటోలోనో రండి" అని సుజాతకు చెప్పి, కొంత డబ్బు ఆమె చేతిలో పెట్టాడు, సుబ్బరామయ్య

ఆరోజు విశ్వంతో కలిసి సినిమాకు వెళ్లిన సంఘటన ఒక మరుపురాని మధురానుభూతిగా నిలిచిపోయింది సుజాత హృదయంలో

ఇంటిదగ్గర సినిమాకు బయలుదేరి — ఇంటికి తిరిగివచ్చేవరకు అడుగడుగునా విశ్వం ప్రవర్తనను పూర్తిగా పరిశీలించి చూసింది ఆమె

ఎంత వెతికినా అతని మాటల్లో నిష్కల్మషత్వం తప్ప మరోటి కనిపించలేదు పైగా అతడు మాట్లాడిన ప్రతి మాటలోనూ ఎంతో అభిమానం ద్యోతకమైంది

"నిన్ను ఏదైనా సినిమాకు తీసుకువెళ్లాలని నేన అనుకున్నాను చాలాసార్లు అయితే అంత చొరవ కూడదని నా అంతరాత్మ ప్రబోధించింది అలా నేను అనటంవల్ల నీవు ఏమనుకుంటావో, మీ పెద్దలు ఏవిధంగా భావించుకుంటారో అనే సంకోచించాను ఒక సంతోషం లేక, ఒక వినోదం ఎరక్క — నీవు మానసికంగా ఎంత కృంగిపోయేదీ నేను వూహించుకోగలను కొందరు సంకుచితుల హృదయంలో నువ్వు అనాకారివి కావచ్చు వాళ్లు యీ లోకంలో అనుభవించే సుఖ సంతోషాలు నీకు లేవని అనుకోవచ్చు కానీ, నా దృష్టిలో మాత్రం నువ్వు అందరిలాంట — మామూలు వ్యక్తివే అలాంటప్పుడు మనుష్య సంబంధమైన ఆశలు ఆకాంక్షలు, ఆనందాలు నీకూ వుంటాయి అందుకే నిన్ను ఏదోవిధంగా సంతోషపరుస్తూ వుండాలనిపించింది అయితే, ఎందువల్లనో నువ్వు సుమలా నాతో సోషల్‌గా వుండలేకపోతున్నావ్ ఏం ? నిన్ను నా గదికి రావద్దన్నానా ? నాతో మాట్లాడవద్దన్నానా ? నాతో చనువుగా వుండటమేకాదు సుమ నామీద అర్థంలేని ఆశలు పెంచుకుంటోందని కూడా నాకు అనుమానం కలుగుతోంది ఇప్పటికైనా నువ్వు నాతో సహకరిస్తే ఆమెలో నాపై పిచ్చి పిచ్చి ఆలోచనలకు తావులేదని తెలియచెప్పగలను ఏదైనా సుజాతా, నేను ఒక మాటకు కట్టుబడివుంటాను నమ్మకద్రోహం చేయటం — చిన్నప్పట్నుంచీ కూడా నాకు చేతకాదు" అంటూ తన అంతర్యాన్ని విప్పిచెప్పాడు విశ్వం

అతడి మాటలు విన్నాక తన తల్లి అనుమానాలకు, తండ్రి సందేహాలకు అర్థంలేదని అనిపించింది— ఇక ఆ వ్యక్తి ముందు తను నటించటంమాట తలుచుకొని లోలోపల ఎంతో పశ్చాత్తాప పడింది సుజాత

ఇంటికి వచ్చాక విశ్వం మీద కూతురి

> **జరిగిన కథ 4** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసన్ చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కలత చెందుతాడు సుబ్బరామయ్య తన అల్లుడికి వుద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాథం సుబ్బరామయ్యని కోర్తాడు సుబ్బరామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు రమేష్ వ్యాపారానికి కావలసిన అప్పిప్పించటానికి అంగీకరిస్తాడు సుబ్బరామయ్య ఆ యింట్లో రామనాథంచే వదలబడ్డ అనాథ విశ్వం, తన మాట నేర్పుతో అందరికి చేరువ అవుతాడు అందాలరాశి సుమను వలలో వేసుకోడానికే విశ్వం నాటక మాడుతున్నాడని సుధాకర్‌కు నూరిపోస్తాడు రమేష్

అభిప్రాయాలు తెలుసుకొని నమ్మి నమ్మలేకపోయారు సుందరి, సుబ్బరామయ్యలు

"తర్వాత మాట చూసుకోవచ్చు ముందు వీళ్లిద్దరికీ పెళ్లి చేసేస్తే ?" సుందరి సలహా

"మనం తొందరపడకూడదు సుందరీ ! మరి కొంత ఓపికపట్టటం మంచిది అసలు ఎవరు చేసుకున్నా, చేసుకోకపోయినా నేను బ్రతికున్నంత కాలం నా కూతురు నా కళ్లెదటే వుండి సుఖమో దుఃఖమో నాతోటే అనుభవిస్తుంది అంతేకానీ, పెళ్లినెపాన దాన్ని యమకూపంలోకి తోయలేను మంగళసూత్రం దాని పాలిట ఉరిత్రాడు కాకూడదు మనిషిది కోతి స్వభావం విశ్వం ఈవేళ ఏదో ఆవేశంలో అలా మాట్లాడినా రేపు అతడి మనసు ఎలా మారుతుందో ? ఏదేమైనా నాకు నమ్మకం చిక్కనంతవరకు సుజాతకు పెళ్లి చెయ్యను" అని విప్పిచీగా చెప్పాడు సుబ్బరామయ్య

"మరి అతణ్ణి ఇంట్లో ఎందుకు తెచ్చిపెట్టుకున్నట్లు ?"

"పోనీ ఉండనీ తింటే గుప్పెడు మెతుకు లేగా ? స్వభావం మంచిదే అయితే రేపు మనమీద విశ్వాసం కనబరుస్తాడు లేకపోతే గత జన్మలో మన మతడికి ఋణపడివుంటాం అని సరిపెట్టుకుంటే సరి"

"సుమనయినా మీరు కొంచెం కట్టుబాటులో పెట్టాలి"

"అనవసరం సుందరీ ! సుమను మనం కట్టుబాట్లలో పెట్టి ప్రయోజనం ఏముంది ? అవతల వ్యక్తిది చంచల స్వభావం కాకపోతే మనమ్మాయే కాదు — ఏ వరాయిపిల్ల విషయంలోనూ ఆశలు కల్పించడు అదే చపలచిత్తుడవుతాడూ — ఎదటి వాళ్లకు అన్యాయంచేసి తను అన్యాయమైపోతాడు చివరకు"

"ఏమోనండీ — మీ మాటలేమో, మీ పద్ధతులేమో" అంది సుందరి భర్త మాటలకు విసిగిపోయి

## 11

"రాత్రి నన్నుకూడా సినిమాకు తీసుకువెళ్తే ఏం పోయింది మీది ?" — అంది సుమ మర్నాడు ప్రొద్దుట విశ్వం గదిలోకి వచ్చి

చదువుతున్న పుస్తకం మూసేసి సుమ ముఖంలోకి అదోమాదిరిగా చూస్తూ సన్నగా నవ్వాడు విశ్వం

"నేను కాదన్నానా ?"

"మీరు మా నాన్నగారికి చెప్పి ఉంటే"

"మధ్యలో నీ రాయబార మేమిటయ్యా అని మొహంమీదే అంటారు"

"అవుననుకోండి సరేకానీ, అక్కయ్యను మీరు సినిమాకు ఎలా తీసుకువెళ్లారు ?"

"ఏం ? మామూలుగానే"

"కావాలంటే మానుకుంటాను కానీ, నేను దాంతో వస్తే సినిమాకు వెళ్లను అది నా అక్క అని పరిచయస్తులకు చెప్పుకోవాలంటేనే నాకు సిగ్గుగా ఉంటుంది"

"నేనంత చెప్పినా సుజాత విషయంలో నీవు మారలేదన్నమాట"

"ఇప్పుడు నేను చెప్పింది బయటి సంగతి మీరు ఆ రోజు చెప్పిన విషయం గురించి నేనూ చాలా చాలా ఆలోచించాను విధివశాత్తు నేనే అనాకారినైతే — నలుగురూ నన్నే వేలెత్తి చూపిస్తుంటే నా మనసెంత బాధపడుతుందో అప్పుడు ఊహించుకున్నాను అప్పట్నుంచీ సుజాతను అక్కగా గౌరవిస్తూనే ఉన్నాను ఇంట్లో"

"అయితే బయట ?"

"అది వేరే విషయంలెండి అయినా ఎవరి వ్యక్తిగతాభిప్రాయాలు వాళ్ళవి"

సుమవి మొండి మాటలుగా తోచాయి ఆమె మనస్తత్వం కూడా అంత సులభంగా మారేదిగా తోచలేదు సుజాత విషయమై ఎప్పుడో పాతుకుపోయిన ఆమెలోని ఆ భావాలను తనిక మార్చలేడు అన్న నిర్ణయానికి అప్పుడే వచ్చాడు

"కాకి ముక్కుకు దొండపండని మీ పక్కన దాన్ని చూసి బజార్లో చాలామంది నవ్వి ఉంటారు మీ మనసూ కొంతలో కొంత బాధపడి ఉంటుంది అవునా ?" ఏవో ఆలోచనలకుపోయి సుమే అంది

ఆమె మీద విశ్వానికి నిజంగానే కోపం వచ్చింది కానీ నిగ్రహించుకున్నాడు

"దానికి సినిమాలేమిటి ? అయినా, అది అడిగితే మీరెలా ఒప్పుకున్నారు ?"

" "

(28వ పేజీ చూడండి)





ప్రేమమందిరం లో కృష్ణంరాజ భారతి

## మదరాసులో మృత్యుంజయుడు

మృత్యువును జయించి మరుజన్మ ధరించిన అక్కినేనిని మృత్యుంజయుడ అనడం భావ్యమే కొత్త రక్తం ప్రవహిస్తున్నది పెంబంగాబట్టే పత్తి భరాన్ని (స్టుడియో) శీఘ్రంగా నిర్వహింపగలిగారు

రోజుకు పదహారు గంటలు యాక్టివ్‌గా యిప్పటికీ పని చేస్తున్న అక్కినేని ఎప్రిల్ ఒకటి నాటికి పొప్పకున్న చిత్రాలు యిరవైకి ఒక్కటి తక్కువ

మార్చి యిరవై ఆరు నుంచి ఎప్రిల్ అయిదు వరకు నాగేశ్వరరావు మదరాసులో వున్న సమయాన ఆయన చేసిన పనుల

[ సెక్రటరీ కి డబ్బింగ్ చెప్పడం సన్యాసి రాజా కధపై విక్టరీతో చర్చించడం ఎ ఎ ఎ జగపతి వాళ్లకు కృష్ణవేణికి కాల్‌షీట్లు యివ్వడం మహాత్ముడు డ్రస్ ట్రయిల్ చూడడం ]

### మనవరాలు పుట్టింది

నటసమ్రాట్ గారి జ్యేష్ఠ పుత్రిక అమెరికాలో నివసిస్తున్నారు ఆమెకు మార్చి 12న డబ్బపండులాంటి కుమార్తె పుట్టింది తల్లి బిడ ఆరోగ్యంగా వున్నారు అక్కినేని సరోకసారి తాత అయ్యారన్న మాట మనవడు చిరంజీవి సుమంత్ నాగేశ్వరరావు అన్నపూర్ణమ్మగార్లవద్ద పెరుగుతున్నాడు

తన మనవడు మహానటుడు అవుతాడన్న నమ్మకం అక్కినేనికి వుంది

### కొత్త చిత్రాల షూటింగు

రామానాయుడుగారి సెక్రటరీ చిత్ర నిర్మాణం పూర్తయింది ఏప్రిల్ ఆరు నుంచి



## * * సినిమా విశేషాలు * *

మే 15 వరకు మహాత్ముడు షూటింగులో పాల్గొంటారు

మే 16న అమెరికా వెళ్తారు జూన్ మొదట వారంలో స్వదేశానికి వస్తారు జూన్ 15 నుంచి ఊటీలో మహాత్ముడు పాటల చిత్రీకరణలో పాలొంటారు

### రామారావుగారి చిత్రం

జులై నుంచి వరుసగా మూడు మాసాలు (జులై, ఆగస్టు సెప్టెంబర్) నటరత్న గారి చాణక్య చంద్రగుప్త కు 45 రోజులు పని చేస్తారు ప్రతి నెలా పక్షం రోజు లన్నమాట

ఆగస్టు నుంచి నెలకు 15 రోజులు చొప్పున చక్రధారి కి పనిచేస్తూ, జగపతివారి బంగారు బొమ్మలు, శ్రీనివాసా ఏజెన్సీస్‌వారి సన్యాసిరాజా ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి కొత్త చిత్రం కోసం తేదీలను కేటాయించారు

ఎప్రిల్ చివరి రోజున లక్షలాది ప్రేక్షకులు తియ్యని ఆశలను పెంచుకున్న సెక్రటరీ చిత్రం విడుదలవుతుంది తర్వాత సెప్టెంబరు యిరవైన అంటే అక్కినేనిగారి జన్మదినాన మహాత్ముడు" విడుదలవుతుంది

సంక్రాంతికి చాణక్య చంద్రగుప్త, ఫిబ్రవరికి చక్రధారి మార్చికి బంగారు బొమ్మలు" విడుదలయ్యే విధంగా అక్కినేని ప్లాన్ చేసుకున్నారు.

### వచ్చే ఏడు లాబ్ రెడీ

విఖ్యాత చిత్ర నిర్మాత దర్శకుడు ఎల్ వి. ప్రసాద్‌గారితో కలిసి తలపెట్టిన కలర్ లాబ్ వచ్చే ఏడు రెడీ అవుతుందన్న వార్తను అక్కినేని చెప్పారు.

అన్నపూర్ణా స్టుడియోస్‌లో తన చిత్రాలకే గాక, తదితరులకు కూడా అవకాశం వుంటుంది అని అక్కినేని వివరించారు

తనకు రామారావుగారికి కుదిరిన చాణక్య—చంద్రగుప్త స్నేహం ప్రేక్షకులకు అమితానందాన్ని కలిగిస్తున్న నిజాన్ని, అభిమానులు రాసే ఉత్తరాలు స్పష్టపరుస్తున్నాయి, అన్నారు 'నటసమ్రాట్.'



మగాడు లో మంజుల రామారావు



అదృష్టవంతురాలు లో ప్రభ వలం

నటరత్న చిత్రంలో అక్కినేని నటిస్తున్నట్టే నటసమ్రాట్ నిర్మించే చిత్రంలో నందమూరి ప్రధాన పాత్ర పోషించే మంచిరోజు దూరానలేదు

### ఒకే చిత్రంలో ముగ్గురు ప్రతిభావంతులు

ప్రేమాయణం చిత్రాన్ని పూర్తిచేసిన ముప్పలనేని శేషగిరిరావు జనవరి తొమ్మిదిన అక్కినేని అంగీకారాన్ని పొందారు

శ్రీనివాసా ఎజన్సీస్ తలపెట్టిన రెండవ చిత్రంలో నటసమ్రాట్ ఒక విమాత్నమైన పాత్రను పోషిస్తున్నారు అక్కినేని కథానాయకుడుగా నటిస్తున్న ఆ చిత్రంలో ఊర్వశి శారద కళా వాచస్పతి జగ్గయ్య ముఖ్య పాత్రలను పోషించగలరని నిర్మాత శేషగిరిరావు చెప్పారు

నవంబరు డిశంబరు నెలల్లో అన్నపూర్ణా స్టుడియోస్‌లో షూటింగు జరుగనున్న శ్రీనివాసా ఏజన్సీస్ చిత్రానికి ఆచార్య ఆత్రేయ, మహాదేవన్ సాహిత్య సంగీతాలను సమకూర్చగలరని విక్టరీ మధుసూదనరావు దర్శకత్వాన్ని నిర్వహిస్తారని చెప్పారు

### సెప్టెంబర్ నుంచి బంగారుబొమ్మలు

జగపతి ఆర్ట్ ఎక్సర్స్ విదేశాల్లో నిర్మించ దలచిన బంగారుబొమ్మలు వర్ణ చిత్రం షూటింగు స్వదేశంలోనే జరుగగలదని, నిర్మాత దర్శకుడు వి బి రాజేంద్రప్రసాద్ చెప్పారు

భారత ప్రభుత్వం విదేశాల్లో చిత్రనిర్మాణం చెయ్యకూడదని ఆంక్ష విధించింది బంగారు బొమ్మలు చిత్ర కథను తదనుగుణంగా మార్చి, సెప్టెంబర్ నుంచి షూటింగు జరపడానికి జగపతి అధినేత నిర్ణయించారు

బంగారుబొమ్మలు చిత్రానికి ఆచార్య ఆత్రేయ వెంకటరత్నం మహదేవన్ సంజీవి

ఏమిటి ? దర్శకుడు స్క్రీన్‌ప్లే ఆధారంగా సన్నివేశాలను "షాట్స్"గా విభజించి (క్లోజ్, మిడ్, లాంగ్, ట్రాలీ, జూమ్, క్రేన్ షాట్స్) ఆ, యా షాట్స్‌ను క్రమబద్ధంగా కాకుండా చిత్రీకరణ వీలునుబట్టి, వీందరవందరగా తీయడం జరుగుతుంది. ఇలా తీసిన ఫిల్మ్ ఎడిటర్ టేబుల్ చేరుతుంది. ఇక్కడే ఎడిటర్ బ్రెయిన్ బాగా పనిచెయ్యాలి. పాటకేలా రాగ, భావ, తాళాలున్నాయో, ప్రతి సన్నివేశానికి ఒక రిథమ్ వుంటుంది. "ఎనాటమి ఆఫ్ ది సీన్"కి భంగం వాటిల్లకుండా, సన్నివేశానికి రిథమిక్ సెన్స్ తీసుకురావడంలోనే ఎడిటర్ తన ప్రతిభ చూపెట్టాలి. తనతోబాటు ప్రేక్షకులను కూడా క్లైమాక్స్‌కు తీసుకెళ్ళి, వారిలో "స్పెల్ బౌండ్ స్టేట్ ఆఫ్ మైండ్"ను క్రియేట్ చేయగలగాలి ఎడిటర్.

## ఎడిటర్ పని

ఉదాహరణకు యావద్భారతంలో అఖండ విజయం సాధించిన "షోలే" చిత్రం ఇపుడున్న నిడివికన్న ఒకటిన్నర ఇంతలు. దాదాపు మూడువత్సరాలు తీశారు. దానిని ఎడిటర్ కుదించి తీసినదే ఇపుడు మనం చూస్తున్న "షోలే". అలాగే "నమ్మిన బంటు" చిత్రంలో ఎడ్ల పందాలను నాల్గు కెమెరాలతో 11,000 వేల అడుగులు తీసారు. కానీ చివరకు ఆ దృశ్యం నిడివి 250 అడుగులకు కుదించాము నేను, కే. శే. ఆదుర్తి సుబ్బారావు, జెమినీ గోపాలన్, సంజీవి, మరో ముగ్గురు అసిస్టెంట్స్. అలా ఎడిట్ చేసిన భాగానికి ఆరు సౌండ్ ట్రాక్స్ వేసాం. మొదటి ట్రాక్‌లో బండి చక్రాల శబ్దం, రెండో ట్రాక్‌లో ఎడ్లమువ్వల శబ్దం, మూడవ ట్రాక్‌లో ప్రజల కోలాహలం, నాల్గవ ట్రాక్‌లో సావిత్రి కేకలు, అయిదవ ట్రాక్‌లో అక్కినేనిగారి అరుపులు, ఆరవ ట్రాక్‌లో బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్ వేసి, అన్నింటిని మిక్స్ చేసాం. అలా చేయడంవల్ల ప్రేక్షకుల కళ్ళముందే ఎడ్ల పందాలు జరుగుతున్నాయనే అనుభూతి కల్గింది. ఇలా వివిధ కోణాలనుంచి రసానుభూతి కల్గించగలిగేది ఎడిటర్ ఒక్కడే.

## హృషీకేష్ అభిమాని

నాకు తెల్సి ఎడిటింగ్ వలన ఎన్నో చిత్రాలు విజయాన్ని సాధించాయి. కేంద్ర ప్రభుత్వ బంగారు నంది అవార్డు నందుకున్న "చెమ్మీన్" చిత్రంలో హృషీకేష్ ముఖర్జీగారి ఎడిటింగ్ ప్రతిభ ఎంతేని వుంది. డైరెక్టర్ తీసిన షాట్స్ కాకుండా, కేవలం సముద్రపు అలలు 6,000 అడుగులు తీసి, ఆ పై చిత్రాన్ని ఎడిట్ చేసి, గొప్ప సంచలనాన్ని సృష్టించారు. అలాగే "గౌతమబుద్ధ" డాక్యుమెంటరీ చిత్రాన్ని సంవత్సరన్నరపాటు విదేశాల్లో కూడా షూట్ చేసి, 60,000 అడుగులు తీసారు. ఆ చిత్రాన్ని హృషీకేష్ 12,000 అడుగులకు తగ్గించారు. అందుకే వారు నా ఫేవరెట్ ఎడిటర్.

సాధారణంగా అనుభవమున్న తారలు షాట్ నిడివిని తెల్సుకుని, ఎంతవరకు అవసరమో అంతవరకే డైలాగు చెప్పటం, ఎక్స్‌ప్రెషన్ యివ్వడం జరుగుతుంది. అలా నేనెరిగిన తారల్లో అక్కినేని నాగేశ్వరరావుగారొకరు. ఎడిటర్ ప్రతిభావంతుడైతే, కొన్ని కొన్ని సందర్భాలలో పనికిరాని రిలాక్సింగ్ ఎక్స్‌ప్రెషన్స్ కూడా రక్తికడుతుంటాయి.

## ఎడిటరే దర్శకుడైతే !

ఇకపోతే ఎడిటరే దర్శకుడైతే అనే అంశాన్ని గూర్చి చర్చిద్దాం. ఎడిటింగ్‌లో తనకు గల ప్రవేశం వల్ల, ఎడిటరే దర్శకుడైతే ఏ సన్నివేశం ఎంత నిడివి వుంటే బాగుంటుందో అంతవరకే చిత్రీకరించుకోవడం, ఎడిటింగ్‌కు అవసరమైన షాట్స్‌ను కూడా ముందే జాగ్రత్తపడి తీసుకోవడం జరుగుతుంది. ఇలా చేయడంవల్ల నిర్మాణ వ్యయం, కాలయాపనం, ముడిఫిలిమ్ వినియోగం తగ్గుతుంది. ఇందులోనే మరో యిబ్బందికూడా లేకపోలేదు. దర్శకుడే ఎడిటర్ అయినపుడు తన వూహాలమేరకు తీసుకున్న షాట్స్ నిడివిని తగ్గించడానికి మనసొప్పదు. అందుకు నిదర్శనంగా "ఖైదీబాబాయ్" చిత్రాన్ని తీసుకుందాం. నా దర్శకత్వంలో తయారైన "ఖైదీబాబాయ్" చిత్రం ఫైనల్ ఎడిటింగ్ అయ్యేసరికి 16,800 అడుగులు వచ్చింది. మిత్రులు కొందరు నిడివి తగ్గించమని సలహా యిచ్చారు. మనస్కరించకపోయినా, కొట్టకొలది రసహృదయులను దృష్టిలో పెట్టుకుని, ఆ చిత్రాన్ని 15,300 అడుగులకు తీసుకొచ్చాను.

నా తొలి చిత్రం "ఖైదీబాబాయ్"ని ఆదరించి, అభిమానించినట్లే, ప్రస్తుతం నా దర్శకత్వంలో రూపొందుతున్న విజయలక్ష్మీ ఆర్ట్స్ పిక్చర్స్ వారి ప్రొడక్షన్ నెం. 1 చిత్రాన్నికూడా మీ అభిమానవర్షంతో ఆదరిస్తారని విశ్వసిస్తున్నాను.

ఒక ఎడిటర్‌గా, దర్శకుడిగా నా అనుభవంతో తెల్సుకున్న నిజాలను మీ ముందుంచాను. "లోకో భిన్న రుచిః" నా అభిప్రాయంతో ఏకీభవించేవాళ్ళు వుండొచ్చు. ఏకీభవించనివాళ్ళు వుండొచ్చు." అన్నారు ఎడిటర్ కమ్ డైరెక్టర్ టి. కృష్ణ పై టాపిక్‌ను గూర్చి భేటీ జరిపినపుడు. ★



'అదృష్టవంతురాలు'లో వరం, ప్రభ

## ప్రహ్లాదుడి ఆరు పాత్రలు !

మురళీకృష్ణా ఎంటర్ ప్రైజస్‌వారి "సీతమ్మ సంతానం" షూటింగులో ప్రహ్లాదుడు వున్నాడని తెలిసి అక్కడికి వెళ్ళాను.

"ప్రహ్లాదా, నమో నమోః" అంటూ పలకరించాను. ఇంకా ప్రహ్లాదుడేనా అంది, సాఫ్ట్‌ఖానా గెటప్‌లో వున్న రోజారమణి.

"మీరు ఎన్ని చిత్రాల్లో నటించినా, మాకు ప్రహ్లాదుడే గుర్తొస్తాడు. అందుకనే అలా పలకరించాను" అన్నాను.

ప్రస్తుతం ఎన్ని చిత్రాల్లో వున్నారేమిటి అని ప్రశ్నించాను.

ఆరు చిత్రాలు వున్నాయి. రంజిత్‌కుమార్ గారి "మన వూరి కథ", భాటి మూవీస్‌వారి "వెలుగు బాటలు", రామవిజేతావారి "రాందాసు", లావణ్య పిక్చర్స్‌వారి "ముగ్గురు మూర్ఖులు", శ్రీనివాసా ఏజెన్సీస్‌వారి "ప్రేమాయణం", కె. ఎస్. రెడ్డిగారి "సీతమ్మ సంతానం", ఇవిగాక నాలుగు మలయాళ చిత్రాల్లో నటిస్తున్నాను, అంది రోజారమణి.

మన తెలుగు తెరకున్న వుత్తమ కళాకారుల్లో రోజా ఒకర్తె. వర్త్‌కు సరయిన వేల్యూ యివ్వగలిగితే, రోజాకు రాజ దశ తథ్యము.



ఎడిటర్, డైరెక్టర్ 'టి. కృష్ణ'

# సినిమా



అల్లుడొచ్చాడు లో రామకృష్ణ జయసుధ

## రాబోయే రామారావు చిత్రాలు

3 x 10 వత్సరములుగా వెండి తెరలో అద్వితీయమైన స్థానాన్ని ఏర్పరచుకున్న రామారావుగారికి, ప్రేక్షకుల్లో వున్న అభిమానం అన్యులకు సాధ్యమా అనిపిస్తుంది

వెరైటీ పాత్రలను పోషించిన పోషిస్తున్న కథానాయకుడు కూడా రామారావుగారే

ఇటీవల విడుదలైన ఆరాధన చిత్రంలో రామారావు ఎంత నిగ్రహంగా నిండుగా, గంభీరంగా నటించారో అందరికీ ఎరుకే

రాబోయే రామారావుగారి చిత్రాలన్నీ ప్రేక్షకులను ఆకర్షిస్తాయి కారణం ఒక పాత్రకు మరొక దానికి వ్యత్యాసం వుంది గనకనే

ఆదిత్య చిత్రవారి మనుషులంతా ఒక్కటే'' చిత్రంలో ఎన్టిఆర్ తండ్రిగా తనయుడుగా విశిష్టంగా నటించారు దాసరి నందమూరి మొదటి కాంబినేషన్ కూడా యిదే తాతా .. బాగున్నావా పాటలో నందమూరి ఎంత స్లిమ్ముగా వున్నారో తెలుసా !

రాజ్యం కంబైన్స్‌వారి దీవార్ చిత్రంలో ఎన్టిఆర్ తన విశ్వరూపాన్ని ప్రదర్శించారు ఆయన నటించిన ప్రతి సీనుకు ప్రేక్షకులు క్లాప్స్ కొట్టగలరు మాస్ మైండ్ తెలిసిన ఎస్ డి లాల్ దీవార్ ను బాగా రక్తి కట్టిస్తున్నారు

త్రివేణి ప్రొడక్షన్స్‌వారి బంగారు మనిష'' చిత్రంలో బాధ్యత నెరిగిన కలెక్టరుగా పాశం వున్న వుత్తమ పుత్రుడుగా 'నటరత్న రత్నంలాంటి నటన్ను చూపెడుతున్నారు ప్రముఖుడు భీమ్‌సింగ్ దర్శకుడాయె !

రవిచిత్ర ఫిలిమ్స్‌వారి నేరం నాది కాదు .. ఆకలిది చిత్రంలోని రామారావుగారి వేషం ఎంత వుదాత్తమైనదో ఆయన నటన అంత వుత్తమంగా వుంటూంది

పై నుదహరించిన పాత్రలన్నీ వెరైటీ గావడం వల్ల, ప్రతి పాత్రలో సరికొత్త నందమూరి కనిపిస్తారు గనక అన్ని చిత్రాలకు ప్రజామోదం లభించ గలదని వ్రాయగలుగుతున్నాను

## నటరత్న మంజుల ఎక్కడకెళ్లారు ?

మార్చి మాసం మన తారలు మదరాసులో వుండలేనంత ఉష్ణం తాండవమాడ్తొంది వేడిని స్టుడియోల్లో భరించడం మరీ కష్టం

అందుకనే నటరత్న రామారావు శీతల ప్రదేశానికి వెళ్లారు తనవెంట మంజులను తీసుకెళ్లారు ప్రభకూడా వెంబడించింది

రవి చిత్ర అధినేత వై వి రావ్‌గారు నేరం నాదికాదు ఆకలిది వర్ణ చిత్రం తాలూకు పాటలను ఊటీలో ప్లాన్ చేశారు రామారావు మంజుల రామారావు ప్రభ పాల్గొన్న మూడు పాటలను దర్శకుడు ఎస్ డి లాల్ చిత్రీకరించారు

హిందీ చిత్రం రోటీ ఆధారంగా నేరం నాదికాదు ఆకలిది తయారవుతూంది నటరత్న అద్భుతంగా నటిస్తున్న యీ వర్ణ చిత్రంలో గుమ్మడి ప్రభాకరరెడ్డి కాంతారావు పద్మనాభం రాజనాల త్యాగరాజు మంజుల ప్రభ కె విజయ పండరీబాయి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు మాస్ కాస్ ప్రేక్షకులను యీ చిత్రం ఆకర్షిస్తుంది

## ప్రేమమందిరం

ఆరడుగుల సుందరాంగుడు కృష్ణంరాజు తన వాడైనప్పుడు భారతి ఆనందానికి అవధులు వుండగలవా ? మెడలోని మంగళసూత్రాన్ని పదే పదే కళ్లకద్దుకుని మురిసిపోయింది వేచియున్న రేయి రానేవచ్చింది ఏకాంత మందిరాన భార్య రాకకు వేయి కండ్లతో నిరీక్షిస్తూవున్న కృష్ణంరాజు ఆమె అడుగిడిన మరుక్షణమే కౌగిలిలో బంధించాడ ఆ మధురక్షణం భారతిలో కోటి కోర్కెలను వెలిగించింది భర్త వొడిలో ఆనంద స్వర్గాన్ని చవి చూచింది

ఇది ఏదో ఒక హాయి
ఇక రాదు నేటి రేయి
అనురాగమే పరాగం
ఎద వీణపై ధ్వనించెనే పదే పదే
మనసే ప్రేమమయం అలయం

అంటూ భర్త సన్నిధిలో స్వర్గసుఖాలను అనుభవించింది

ఈ అనురాగబంధాన్ని కవి ఆరుద్ర ఎంత అందంగా రచించారో అంతటి ఆనందానుభూతిని కృష్ణంరాజు భారతి అభినయించారు ప్రేమ మందిరం చిత్రంలో ఈ పాటను సుశీల బాలు మధుర మధురంగా పాడారు ఎస్ రాజేశ్వరరావు సుమధుర సంగీతాన్ని సమకూర్చారు

ఆర్ ఎం ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న ప్రేమ మందిరం చిత్రం దాదాపు పూర్తయినట్టు కథకుడు నిర్మాత కె ఎల్ చవుదరి చెప్పారు ఈ చిత్రంలో కృష్ణంరాజు శ్రీధర్ చంద్ర మోహన్ భారతి విజయలలిత జి వరలక్ష్మి సుధ ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు హల్లో హల్లో రావుగారిది విచిత్రమైన వేషం ప్రేక్షకులు ప్రత్యేకంగా గోపాలరావును ప్రశంసించగలరు పాత్రలో విశిష్టత వుండబట్టే కృష్ణంరాజు ప్రేమమందిరం లో నటిస్తున్నారని ప్రేక్షకుల ఊహించేది నిజమే

ప్రేమమందిరం చిత్రంలో ప్రముఖ గాయకుడు బాలసుబ్రమణ్యం అతిధి వేషాన్ని (జయమాలిని క్లబ్ సెట్లో) వేసినట్టు నిర్మాత చవుదరి చెప్పారు

ఎడిటింగులో ఎక్స్‌పర్ట్ అగు అక్కినేని సంజీవ్ ప్రేమమందిరం చిత్రాన్ని ప్రేక్షకులు ప్రేమించేవిధంగా రూపొందిస్తున్నారు

ఈ చిత్రం ద్వారా సురేష్ అనే దుష్టనటుడు పరిచయం అవుతున్నాడు ఈ చిత్ర నిర్మాణ నిర్వహణని ఆజీజ్ చేస్తున్నారు.



సెక్రటరీ లో వాణిశ్రీ అక్కినేని



ఒకదీపం వెలిగింది లో చంద్రకళ సత్యేంద్రకుమార్

### అక్కినేని చూచిన సన్యాసిరాజా

వంగ చిత్రరంగంలో సంచలనాన్ని సృష్టిస్తున్న సన్యాసిరాజా చిత్రాన్ని తెలుగులో నిర్మించే హక్కులను ముప్పలనేని శేషగిరిరావు కైవశం చేసుకున్న విజం పాఠకులకు తెలుసు

తెలుగులో అక్కినేని సన్యాసిరాజా పాత్రను పోషించడానికి అంగీకరించిన వార్త ప్రేక్షకులకు తెలుసు తెలుగు చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు అనికూడా పాఠక ప్రేక్షకులకు తెలుసు

ఇరవై రెండు వారాలుగా కలకత్తా పట్టణంలో హవుస్‌ఫుల్ గా నడుస్తున్న సన్యాసిరాజా చిత్రాన్ని నటసమ్రాట్ మార్చి తొమ్మిదిన ఎ వి ఎమ్ డీలక్స్ థియేటర్లో చూశారు

### అక్కినేని అనుభూతి

సన్యాసిరాజా చిత్రాన్ని చూచిన అక్కినేని గారిని అభిప్రాయం చెప్పమని అడిగాను ఇట్ యీజ్ రియల్లీ సుపర్బ్ నా మనసును ఆకర్షించింది అన్నారు

### మహాకవి క్షేత్రయ్య

మార్చి తొమ్మిదిన అంజలీ పిక్చర్ కంబైన్స్ వారి మహాకవి క్షేత్రయ్య వర్ణ చిత్రం మిక్సింగ్ పూర్తయింది మిక్సింగ్ పూర్తయిన తరువాత పదహారున సెన్సార్ బోర్డుకు చిత్రాన్ని చూపించడం జరిగింది క్లీన్ సర్టిఫికేట్ యివ్వబడింది

అదే రోజు సాయంత్రం ముఖ్యులు కొందరు మహాకవి క్షేత్రయ్యను చూశారు చిత్రం నిడివి పదహారు వేలు కన్నార్పకుండా చిత్రాన్ని ఆసక్తితో చూచారు అందరు

### అందరిదీ ఒకే మాట

అక్కినేని అందంగా వున్నారు అద్భుతంగా నటించారు ఆదినారాయణరావుగారి సంగీతం మధుర మనోహరంగా వుంది భారీ సెట్టింగులు, అనిర్వచనీయమైన ఆనందాన్ని యిచ్చే నృత్యాలు కన్నుల పండువచేసే ఛాయాగ్రహణం చిత్రానికి వన్నె తెచ్చాయి

చిత్రంలో ప్రధాన పాత్రలను పోషించిన అంజలీదేవి రాజబాబు మంజుల జయసుధ ప్రభ కాంతారావు ప్రభాకరరెడ్డి కృష్ణకుమారి గిరిబాబు ధూళిపాళ రాధాకుమారి రావి కొండలరావు హేమలత మరియు రావు గోపాలరావు పాత్రోచితంగా నటించారు

ఆదినారాయణరావుగారి సంగీతాన్ని రామకృష్ణ తన వాయిస్ ప్రతిభతో పదే పదే పాడుకునే విధంగా కృషి చేశాడు పి ఎస్ ఆర్ స్వామి ఆరుద్ర ఎ ఎస్ రావ్‌గార్ల సమిష్టి కృషి చిత్రాన్ని మధుర కావ్యంగా రూపొందించింది అన్నారు వీక్షకులు

### ముఖ్యమంత్రి ప్రారంభించిన చిత్రం

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు స్విచ్ ఆన్ చెయ్య, ఆర్థికమంత్రి శ్రీ ఎ రంగారెడ్డి క్లాప్ కొట్ట ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి తూర్పు పడమర చిత్రం భాగ్యనగరంలో ప్రారంభమైంది

మార్చి 18న ప్రారంభమైన తూర్పు పడమర చిత్రం మే 4 కల్లా పూర్తవుతుందన్న సమాచారాన్ని నిర్మాత రాఘవ వెల్లడించారు

### దాసరికి అమ్మాయి దొరికింది

తూర్పు పడమర చిత్రానికి దాసరి దర్శకత్వంతోబాటు మాటల రచన్ను చిత్రానువాదాన్ని నిర్వహిస్తున్నారు ఈ చిత్రంలోని కథానాయిక పాత్రను కొత్తమ్మాయికి యిచ్చినట్లు చెప్పారు విశాల నేత్రాలు వున్న ఆ అమ్మాయికి మాధవి అని పేరు పెట్టారు (మాధవికి బలే ఛాన్సు తగిలింది )

తూర్పు పడమర చిత్రంలో సత్యనారాయణ శ్రీవిద్య, నాగేష్ నరసింహరాజు ముఖ్య పాత్రధారులు

తూర్పు పడమర చిత్రంలోని మాణిక్యాల్లాంటి డాక్టర్ నారాయణరెడ్డిగారి పాటలకు రమేష్‌నాయుడు మరపురాని బాణీలను సమకూర్చారు ఈ చిత్రం తారకరామ శ్రీ తారకరామ నవభారత్ ద్వారా విడుదలవుతుంది

— శ్రీనివాస్



ప్రేమ మందిరం లో శ్రీధర్ కృష్ణంరాజు

"ఈసారి మాత్రం మీరు దాంతో సినిమాకు బయలుదేరారంటే నామీద ఒట్టే"

"                    "

"మనిద్దరం కలిసి పిక్చర్‌కు వెళ్దామని ఎన్నో సార్లు అడిగితే మీరు కాదన్నారు కానీ, సుజాత అడిగీ అడగటంతోటే సరే అనేశారు ఇదెక్కడి న్యాయమండీ బాబూ"

సుమ వెనకే — అసలు వీళ్ళ మాటలేమిటో వినాలని పనికట్టుకు వచ్చి గది మొత్తదగ్గరే నిలబడి ఉన్న సుజాత ఇక పట్టలేక — పరిస్థితి ఎలా ఉంటుందో చూద్దామని గదిలోకే వచ్చింది

ఆమెను చూసి విశ్వం తొణకలేదు, బెణకలేదు కానీ, సుమ కొంచెం ఖంగారు పడి, "పని ఉంది బావగారూ మళ్ళీ వస్తాను" అని లేచిపోయింది

సుజాతను కూర్చోమన్నాడు విశ్వం కానీ, ఆమె కూర్చోలేకపోయింది

"ఎలా ఉంది పెళ్ళి కానుక ?" — మాటలేమీ దొరకనట్లు అడిగాడు

"బాగానే ఉంది" అన్నట్లు తల ఊపింది

అసలు అప్పుడు సుజాత మనసు మనసులో లేదంటే సరిపోతుంది ఇందాకటినుంచీ విశ్వం, సుమలు మాట్లాడుకున్న మాటలు విన్నది ముఖ్యంగా తన చెల్లెలి ధోరణి ఆమెకు తీవ్ర మనస్తాపం కలిగించింది అలాంటప్పుడు ఆమె ఏం మాట్లాడుతుంది ? పెదవి విప్పగలిగితేనా ?

ఒకసారి విశ్వం ముఖంలోకి పరిశీలనగా చూసింది అతడి ముఖం కళావిహీనంగా తోచింది 'ఇందులో ఆయన తప్పేముంది అయినా' అని సమాధానపడి ఎలా వచ్చిందో అలాగే బయటికి నడిచింది

రాత్రి ఆ పెళ్ళికానుక సినిమా చూసినప్పుడే చిత్రవిచిత్రమైన అనుభూతులు కలిగాయి సుజాతకు

ఆ సినిమాలో నాయకుడు ఒక్కడు ఇద్దరు ప్రేమిస్తారతణ్ణి ఒకరికి తెలియకుండా ఒకరు చివరకు అక్కకోసం చెల్లెలే త్యాగం చేస్తుంది అందులోలానే యిపుడు విశ్వం ! కానీ, తను, తన కుటుంబ పరిస్థితులు ఆ చిత్ర కథకు భిన్నమైనవి ఒకవేళ సుమ కూడా విశ్వంను ప్రేమించి, దానికి తనమీద గల అనురాగంకొద్దీ ఆ సినిమాలోలానే త్యాగం చేస్తే ? యిదో తీయటి ఆలోచన

వీల్లేదు విశ్వం కేవలం తనను గురించే పిలవబడ్డాడు అతణ్ణి వివాహం చేసుకొనే హక్కు, అతడి ప్రేమను పొందే అదృష్టం తనదే ఈ విషయం సుమకూ తెలిసిందే కాబట్టి అది విశ్వం మీద ఆశలు పెంచుకొనే అవకాశంలేదు తనకు అడ్డువచ్చే ప్రశ్నేలేదు — యిదో ధైర్యం

మొత్తానికి ఆ సినిమా అయిపోయేవరకూ యిలాంటి వూహలే ఆమె మనసునిండా ముసురుకొని వుక్కిరిబిక్కిరి చేశాయి

యిపుడు సుమ మాటలు, విశ్వంపట్ల ఆమె అభిప్రాయాలు తెలుసుకున్న తర్వాత సుజాతలో తన బ్రతుకుమీద అపనమ్మకంలాంటిది ఏదో బయలుదేరింది ఈనాడు కాకపోయినా భవిష్యత్తులో ఒకనాడు తను — ఏదో త్యాగానికి పూనుకోక తప్పదన్నమాట ! ?

# కాలమిచ్చిన తీర్పు

(23వ పేజీ తరువాయి)

ముందు ఆలోచనలు అలా తీవ్రస్థాయికి వెళ్ళినా — తర్వాత తన్ని తనే సంభాళించుకొంది సుజాత చిన్నపిల్ల సుమ అయినా అది తనకు పరాయిదా ? స్వంత చెల్లెలు తనకు యెలాగో సుఖపడే రాత లేదు చిన్నప్పుడే అలా రూఢిచేసి భూమ్మీదికి పంపాడు ఆ దేవుడు పోనీ దాన్నయినా ప్రశాంతిగా బ్రతకనీ జీవితాంతం సుఖసంతోషాలు అదే అనుభవించనీ — అనుకొంది ఉదారభావంతో

మొదట్నుంచీకూడా సుజాత తను తినాలనీ, తను సుఖపడాలనీ ఏనాడూ కోరుకోలేదు తల్లి పెట్టింది తిని — యింకా తమకు ఆ వస్తువు కావాలని ఏడ్చే తమ్ముడు, చెల్లాయిలకు తన చేతిలోది పెట్టి వాళ్ళు తింటూంటే చూసి సంబరపడేది అప్పట్నుంచీ ఇప్పటివరకుకూడా అన్ని విషయాల్లోనూ అలాగే నడుచుకొంటోంది

ఇపుడు విశ్వం — ఆమె హృదయంలో కొత్త సమస్య

## 12

ఆ ఉదయం జరిగిన సంఘటనే విశ్వానికి పదే పదే గుర్తువస్తోంది

సుమ మాటలకు — పాపం, సుజాత మనసు ఎంత బాధపడిందో ? రక్తసంబంధం — స్వంత అక్క — ఈ సంగతి మరిచిపోయి పరాయివాళ్ళెవరో ప్రవర్తించినట్లు ప్రవర్తిస్తోంది సుమ సుజాత విషయంలో

అసలు తను ఏ నిబంధన మీద వచ్చాడు ఈ ఊరు ?

"సుబ్బరామయ్య నీ బ్రతుకును బాగుచేస్తాడు నువ్వు మాత్రం అతడి కూతురు సుజాతను చేసుకు తీరాలి ఇందుకు మనస్పూర్తిగా అంగీకరిస్తేనే నిన్ను అక్కడికి తీసుకువెళ్తాను" అన్నారు రామనాథం మాస్టారు సరైన తెరువులేక, బ్రతుకే భారంగ గడుపుతున్న తనకు ఇదొక మహదవకాశంగా తోచింది అదీగాక 'కేవలం మనిషినిబట్టి కాక — ఆ మనిషి మనసునుబట్టి ఎవర్నయినా గౌరవించాలి' అన్న దృఢాభిప్రాయం కలవాడు తను అందుకే సుజాత అనాకారి అని తెలిసీ తను అయనతో వచ్చేశాడు

'అయితే అంతా కొత్త వాతావరణం స్వరూపం ఎలా ఉన్నా మరి సుజాత స్వభావం ఎలాంటిదో ? — ఒకవేళ ఆమె భావాలు నచ్చని పక్షంలో తిరిగి తను తన ఊరు చేరుకోవాలి. అంతేకానీ ఇతరులకు లేనిపోని ఆశలు కల్పించి — వంచించటం తనవల్ల అయ్యే పని కాదు' — ఇదే మాట ఇక్కడికి వచ్చేముందు రామనాథంగారికి గట్టిగా చెబితే, 'ఆ అమ్మాయికేం ? లక్షణమైన పిల్ల స్వభావం కూడా ఎంతో మంచిది సరే, కొంత కాలంపాటు అక్కడుంటే నీకే తెలుస్తుంది అంతా కానీ, విశ్వం, నీకు దొరికిన ఈ అవకాశాన్ని మాత్రం తొందరపడి చేయి జార్చుకోకు కాలమాన పరిస్థితులు ఏమీ బావుండ లేదు మహా మహా వాళ్ళకే ఉద్యోగాలు దొరకక తల్లక్రిందు లవుతున్నారు అయినా ఎంత కాలం ఈ కుగ్రామవాసంలో ఉండి వంటరిగా ఇలా మగ్గిపోతావ్ ? నిన్ను బలవంతం చేస్తున్నాననుకోకు స్వలాభం చూసుకొని నీకీ సలహా ఇవ్వటంలేదు సరే, నీ మాట ప్రకారమే కానీ ఆ అమ్మాయి గుణగణాలు నచ్చకపోతే నువ్వు మన ఊరే తిరిగివచ్చెయ్ సుబ్బరాముడికి నేనెలాగో సర్ది చెప్పుకోగలనులే అప్పుడు' అంటూ పూర్తి హామీ ఇచ్చారు ఆయన

అలాగే ఇక్కడికి వచ్చింది మొదలు సుజాతను ఒక కంట కనిపెట్టే ఉంటున్నాడు. ఎంత వెదికినా ఆమెలో మానసిక లోపాలు కనిపించలేదు తనకు, పైగా గంగిగోవులాంటి వ్యక్తిగా తోచింది అందుకే రామనాథంగారు చెప్పినట్లు ఈ సదవకాశాన్ని వదులుకోకూడదన్న నిర్ణయానికి వచ్చాడు

పోతే సుమ — మొదట్నుంచీ కూడా తనది కలుపుగోలు తత్వం పలకరించనివాళ్ళదే పాపం అన్నట్లు అందరితో మాట్లాడేవాడు అడగలేదని — ఎదటి మనిషి కష్టాలలో ఉంటే మనకెందుకులే అని పట్టీపట్టనట్లు ఊరుకొనే స్వభావం తనకు లేదు

ఎవరితో మాట్లాడినా తను నిష్కల్మషంగా మాట్లాడుతాడు అందులో సరదాగా కబుర్లు చెప్పేవాళ్ళంటే తనకు ఇష్టం సుమ తన గదిలోకి వచ్చి మాట్లాడుతూంటే ఎంతో కాలక్షేపంగా ఉండేది కనుకే ఆమెకు ఆ చొరవ ఇచ్చాడు అయితే చివరకు సుమ — ఈమాత్రపు చనువునే పెడగా అర్ధం చేసుకొంటోంది తనమీ ""మో లేనిపోని ఆశలు కల్పించుకొంటున్నట్లు ప్రొద్దుటి ఆమె మాటలే విప్పి చెబుతున్నాయి

తను వాళ్ళ ఇంటికి ఎందుకు వచ్చిందీ, ఎలా వచ్చిందీ సుమకూ తెలుసు తెలిసీ ఎంత అవివేకంగా ప్రవర్తిస్తోంది ఆమె ? తన చెల్లెలి మాటలు సుజాత హృదయాన్ని ఎంతో గాయపరిచి ఉంటాయి పాపం ! ఇకమాత్రం అలా జరగటానికి వీలు లేదు 'మీ అక్కయ్యను మానసికంగా హింసించే అధికారం నీకు లేదు' అని సుమకు తెలియచెప్పాలి ఎలా ? — సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో వచ్చి పార్కులో కూర్చున్న విశ్వం ఆలోచనల్లోపడి— కైమే మరిచిపోయాడు ఆ తర్వాత అదుర్దాగా లేచి బయలుదేరాడు అక్కణ్ణుంచి

విశ్వం తనదారిన తాను చకచక నడిచిపోతూండగా సెంటర్‌లో — హోటల్ సంగమ్ మెయిన్ గేటు దగ్గర తూలుతూ సోలుతూ నిలబడివున్న రమేష్ కనిపించాడు అంతవరకు అతడి ప్రక్కనే వున్న యువతి వెళ్ళి రిక్షాలో కూర్చొని 'టాటా' అని చేతులు వూపుతోంది

నిషా పూర్తిగా తలకెక్కి వుండడు విశ్వాన్ని గుర్తుపట్టి పిలిచాడు రమేష్

ఆ రిక్షా వెళ్ళిపోయింది విశ్వం అతడి దగ్గరికి వెళ్ళాడు

"ఏం విశ్వం ! ఎచ్చటనుండి రాక ?" రమేష్ నాలిక లుంగలు తిరుగుతోంది

"ఊరికే అలా పార్కువరకు వెళ్ళాను" మామూలుగానే సమాధానమిచ్చేడు విశ్వం

"నన్ను చూశావుగా — మధువు సేవించాను మగువ యీవేళకాదు రేపు రమ్మని పోతోంది రిక్షాలో "

పూర్తిగా త్రాగివున్న లతడితో ఏం మాట్లాడాలో తోచలేదు విశ్వానికి అయినా,

# లాక్మే వానిషింగ్ క్రీం

అందాలు చిమ్ముతూ ఆకర్షణ వెద చల్లితే

మీదారి పొడవునా
చూపుల తోరణాలే






చూపుల వయులులో మైమరచి పొండి. లాక్మే వానిషింగ్ క్రీం మీ చర్మాన్ని అందంగా—తాజాగా వుంచుతుంది. మృదువుగా, సహజంగా, మేకప్‌కు ఆదర్శవంతమైన ఆధారం లాక్మే వానిషింగ్ క్రీం. మీ సౌందర్య పోషణ మా ఏకైక ఆశయం.

లాక్మే

# లాక్మే లావెండర్ టాల్క్

## పరిమళ సౌరభం... ఫ్రెంచివారి అనుభూతిపై



లాక్మే లావెండర్ టాల్క్ రాసుకోండి. అసలైన ఫ్రెంచి లావెండర్ యొక్క అపురూపమైన, లావణ్య సువాసన. లాక్మే లావెండర్ టాల్క్



"ఇంటికి వస్తారా ? యిక్కడే కాసేపు వుంటారా ?" అనడిగాడు

"వచ్చిన పనయిపోయిందిగా ! ఇక్కడెందుకు ? పద " అని అడుగుతీసి అడుగు వేయబోయి ముందుకు తూలాడు రమేష్

విశ్వమే అతణ్ణి పడిపోకుండా పట్టుకున్నాడు

"బ్రదర్ ! నడక మనకి లాభంలేదు రిక్షా పిలు " అన్నాడు రమేష్

అలాగే పిలిచి రమేష్‌ను అందులో ఎక్కించి తాను నడిచి వెళ్తానన్నాడు విశ్వం

"వీల్లేదు నీతో మాట్లాడాలి పని వుంది రిక్షా ఎక్కు విశ్వం "

ఒకవిధంగా రమేష్ బలవంతంవల్లే తనూ రిక్షా యెక్కాడు విశ్వం

"విశ్వం ! చాలారోజులుగా నీకో విషయం గట్టిగా చెప్పేయాలనుకొంటున్నాను ఈ వేళ సమయం కలిసివచ్చింది "

ఏమిటి ? అని విశ్వం అడగకుండానే మిగతాదీ అనేశాడు రమేష్

"సుమ నాకు మేనమామ కూతురు అంతే కాదు ఆమెను నేను ప్రేమించాను "

"ఇంకేం ? మీమామయ్యగార్నిఅడిగి పెళ్లి చేసుకో"

"ఎందుకు చేసుకోను ? చేసుకుంటాను నా దాన్ని చేసుకొనే అర్హత, అధికారం నాకున్నాయి కానీ,మాకునువ్వుఅడ్డువస్తున్నావ్ కల్లబొల్లిమాటలు చెప్పి సుమను నీవలలో వేసుకోవాలని చూస్తున్నావ్ "

"సుమమీద నాకు అలాంటి అభిప్రాయం లేదు రమేష్ ! నా స్థితి యేమిటో నాకు తెలుసు నేను చేసుకోవలసిన వ్యక్తి సుజాత ! ముమ్మాటికీ ఆమెనే చేసుకొంటాను "

"నేను నమ్మను పగలు చూస్తే రాత్రి కల్లోకివచ్చే దయ్యం సుజాత ! నేను అందుకే దాన్ని యెవరెంత బ్రతిమిలాడినా చేసుకోలేదు నీకు ఆస్తిపాస్తులు, ఉద్యోగ సద్యోగాలు లేవు వాటిని యెరగా చూపి నిన్ను తన ఇంటిమీదికి తెచ్చిపెట్టుకున్నాడు మా పిచ్చిమామయ్య నువ్వు నీ బ్రతుకును యేదోవిధంగా బాగుచేసుకోవాలన్న స్వార్థంతోనే సుజాతను చేసుకుంటానని నలుగురినీ నమ్మిస్తున్నావ్ కానీ నీ దృష్టంతా సుమమీదే వుంది సుజాతను యీ లోకంలో మనిషి అన్నవాడు ఎవడూ చేసుకోడు నిన్నూ చేసుకోమనటంలేదు దాని ఖర్మకు దాన్ని, సుమను నాకు వదిలేసి నీ దారిన్నువ్వు పో ! కావాలంటే అప్పుచేసయినా సరే నీకు కొంత డబ్బు తెచ్చిస్తాను "

త్రాగిన మైకంలో వున్నా రమేష్ తన మనసులో వున్నదంతా వాగేస్తున్నాడు విశ్వానికీ అతడి ఆంతర్యమేమిటో పూర్తిగా తెలిసిపోతోంది అయినా తనమాటగా చెప్పాడు

"రమేష్ ! తామెంతో జగమంత అన్నట్టు మాట్లాడకు ఈ లోకంలో అందరు యువకుల అభిప్రాయాలు నీలా ఉంటే ఈ ప్రపంచమే సాగదు మనిషి విలువ నీ దృష్టిలో అదమే డబ్బే దైవం త్రాగుడు, వ్యభిచారాలే నీకు నిత్య సత్యాలు కావచ్చు కానీ, నాదంత సంకుచిత తత్వం కాదు చివరి మాటగా చెబుతున్నాను నేను అందరితో అంటున్నట్లుగానే సుజాతను చేసుకొనితీరుతాను ఇక సుమ విషయం — మీరు మీరు చూసుకోవలసిందే అందులో నా ప్రమేయం ఏమాత్రంలేదు ఇకముందూ ఉండదు "

అప్పటికి రమేష్ పూర్తిగా కండీషన్ తప్పాడు లేకపోతే విశ్వం మాటలను ఎలా అర్ధం చేసుకొనేవాడో — ఏమనేవాడో

మరో అయిదునిమిషాల్లో రమేష్‌ఇల్లు వచ్చింది

రిక్షావాలా, విశ్వం కలిసి అతణ్ణి లోపలికి చేర్చారు తన కొడుకును ఆ స్థితిలో చూసి నెత్తి నోరుమొత్తుకొంది సీతమ్మ విశ్వం దగ్గర డబ్బులు లేకపోతే ఆమే రిక్షా అబ్బికి డబ్బిచ్చి పంపివేసింది

హాలులో మంచంమీద అస్తవ్యస్తంగా పడి ఉన్నాడు రమేష్ ఆ ప్రక్కనే కుర్చీలో కూర్చున్నాడు విశ్వం సీతమ్మ వీధి తలుపులువేసివచ్చికొడుకు పడుకున్న మంచంమీదే కాళ్ళకట్టదిక్కున కూర్చొంది

"ఒక్కగానొక్క కొడుకని — ఎన్ని ఆశలు పెట్టుకొని ఎంత గారాబంగా పెంచానో నాయనా వీణ్ణి కానీ, నా ఖర్మం ఇట్టా కాలింది చదువుకొనే రోజులనుంచీ కూడా ఒకటే దురలవాట్లు కడుపు చించుకొంటే కాళ్ళమీద పడుతుందని — నా కొడుకును గురించి ఎవరికి చెప్పుకోను, ఏమని చెప్పుకోను ? ఒకళ్ళకు చెప్పనంత మాత్రాన అసలు సంగతి నలుగురికీ తెలియకుండా ఉంటుందా ? కొడుకేగానీ — వీడు చేసిన పనులు నా నోటితో చెప్పలేను బాబూ " ఆ తల్లి కంఠం దుఃఖంతో పూడుకుపోయింది

"ఊరుకోండి పిన్నిగారూ ! తల్లిగా మీ మనస్తాపాన్ని నేను అర్ధం చేసుకోగలను అయినా అతడే తన చేజేతులా చేసుకుంటున్నప్పుడు మీరు మాత్రం ఏం చేయగలరు ?" — తనకు తోచిన విధంగా సీతమ్మను ఓదార్చాడు విశ్వం

"ఏం చేయలేకే బాబూ, ఊరుకున్నాను దేవుడిలాంటివాడు అన్నయ్య సక్రమంగా నడుచుకొంటే వీణ్ణి ఎంత వృద్ధిలోకి తెచ్చేవాడు ఆయన ! కడుపు చించుకు పుట్టిన కొడుకు కాబట్టి — చిన్నతనంలో వాడెలా తిరిగినా, ఏం చేసినా అన్నింటినీ సహించాను ఇకనైన బాగుపడకపోతాడా అని ఎప్పటికప్పుడు నిరీక్షించి ఎదురు చూశాను కానీ, నేను బ్రతికుండగా వీడిలో మార్పు రాదు బాబూ రాను రాను అలవాట్లు ఎక్కువ అవుతున్నాయే కానీ తరగటం లేదు ఏదో ఆశపడ్డాను కానీ — ఆ పుస్తకాల షాపును నిర్వాకం చేస్తాడన్న నమ్మకం లేదు ఒక ప్రక్క వీడు ఇలా దురలవాట్లతో పతనమైపోవటం చూసికూడా — ఆనాడు అన్నయ్య సుజాతను చేసుకోమని అంత బ్రతిమిలాడితే కాదన్నాడు ఇపుడు సుమను చేసుకోవాలని ఆరాటపడుతున్నాడు మామయ్యతో మాట్లాడు వెళ్లి అని నా ప్రాణం తీస్తున్నాడు కానీ, బాబూ చూస్తూ చూస్తూ ఒక ఆడపిల్లను నట్టేట్లో తోసి ఆ పాపం అంట కట్టుకోలేను ఏనాడు చేసుకున్నదో — ఇపుడు అనుభవిస్తున్నాను చాలు వాడు అరిచి మొత్తుకున్నానేను అన్నయ్యనుఆత్మక్షోభకు గురిచేయలేను"అందిసీతమ్మ

ఆ మాటలు వింటుంటే ఆవిడ హృదయం ఎంత నిష్పక్షపాతమైనదో విశ్వానికి అర్ధమైపోయింది అయినా ఏమీ అనలేకపోయాడు పైకి

మళ్లీ సీతమ్మే అంది

"ఇంకో మాట బాబూ ఈమధ్య సుధ మా ఇంటికి తరచూ వస్తున్నాడు వాడికి రమేష్‌తో స్నేహం ఇద్దరూ కలిసి ఎటెటో తిరిగి వస్తున్నారు అయినా వీడి వయసేమిటి, వాడి వయసేమిటి ? వీళ్ళిద్దరికీ ఎలా ఏర్పడిందో ఈ స్నేహం—నాకేమిటో అనుమానంగా ఉంది బాబూ ఏదేమైనా నాకు పట్టిన గతే అన్నయ్యకు పట్టకూడదన్నది నా తాపత్రయం నేనే అక్కడికి వద్దామనుకొంటున్నాను వచ్చినా 'నా కొడుకువల్ల నీ కొడుకు చెడిపోతున్నాడు జాగ్రత్తపడు' అని ఎలా చెప్పాలి ఆయనకు ? వీలుంటే నువ్వు అన్నయ్యకు ఈ విషయం చెప్పిచూడు బాబూ "

"సరేనండీ ప్రయత్నిస్తాను పిన్నిగారూ, ఇప్పటికే ఆలస్యమైంది నేను వెళ్తానిక" అంటూ లేచాడు విశ్వం

"అలాగే బాబూ సరేకానీ, అడగటం మరిచేపోయాను—మారమేష్ నీ కెక్కడ కలిశాడు ?" అనడిగింది సీతమ్మకూడా లేచి జరిగింది చెప్పాడు విశ్వం !

"మంచి పని చేశావ్ బాబూ "

మరోమారు ఆమెకు చెప్పి బయటకు వచ్చాడు

(47వ పేజీ చూడండి)



అనుభవించు ప్రేక్షకరాజా!

సినిమా లేందే మనం బ్రతకలేం అని తెల్సు కనుక — కూడూ, గుడ్డా, గూడూ, "సిన్మా" అనే నాలుగు యదార్థాలూ నిత్యావసర వస్తువులుకనుక — సదరు సినిమాని ఎవడికోసం చూస్తారులే అని — సినిమాహాలు వాండ్లు వాళ్ల కిష్టమైనరీతిలో బయస్కోపు చూపటం ధర్మమా? అని.

మా వూళ్లో వో హాలుంది క్యూలో నిలబడి టిక్కెట్ తెచ్చుకోవాలంటే భయం వేస్తుంది అంత యిరుకుగా వుంటుందా మార్గం పైగా యిది వేసంకాలం గేటు దగ్గరవున్న వాళ్లకి ప్రేక్షకుడు నడచివస్తే చులకన, లోపలకి టిక్కెట్టు చింపి పంపే వాడికి సిన్మా ప్రేక్షకుడంటే అలుసే, "ఏయ్", "వోయ్", "గురూ" లాంటి ప్రయోగాలు ప్రేక్షకులు వాళ్ళు ఏ తరగతి వాళ్లయినా చేయటం మంచిదికాదు అని పని వాళ్లకి థియేటర్ యజమానులు చెప్పటం అవసరం కాదా?

కొన్ని థియేటర్‌లకి ఎయిర్ కండిషన్‌డ్ రేట్లు ముక్కుపిండి వసూలుచేస్తారు లోపల 'ఎయిర్‌టైట్' చేసి పారేసి వూరుకుంటారు ఫ్యాన్‌లుకూడా వేయరు మరికొన్ని హాళ్లల్లో మొదటిరోజు—రద్దీలో—బయస్కోపుచూడాలని

# సామాన్యుని సహాయుడు

వెయ్యి కళ్లతో ఎదురు చూసివచ్చినవాళ్లు కాస్త మాత్రం ఉక్కబోతకి,తట్టుకోలేరా?అన్నట్లు

పోనీ చివరి రోజుల్లో వెళ్దామా అంటే ఎయిర్ కండిషనింగ్ కాస్తో కూస్తో వుంటుంది కనుక—థియేటర్‌వుద్యోగులు ఎవరో ఒకరిద్దరు వచ్చి మన ముందునో వెనుకనో ఖాళీ సీట్లలో యిష్టాగోష్టి కార్యక్రమం పెట్టుకోటం కూడా కద్దు

టికెట్‌లు సీటు నెంబర్‌ల ప్రకారం యిస్తున్నప్పుడు ప్రేక్షకుడు అడిగిననెంబర్‌లు ఖాళీ వున్నంత మేరకి యివ్వాలి యిది న్యాయం సంప్రదాయం.. కాని కొందరు బుకింగ్ క్లర్కులు మానేజర్‌లు మాకు అలాగే చెప్పారు కనుక రెండో వరుస నుంచే టికెట్‌లు అమ్ముతాం అంటారు మొదటి వరుస యివ్వం అంటారు ధర్మమా? అంటె? అని ఓ ప్రేక్షకుడు గోల

కొన్ని థియేటర్‌లవారు ఆటకీ ఆటకీ మధ్యలో హాలు వూడ్పించే ప్రయత్నంచేయరు దండుగ ఏకంగా పోసారే వూడ్చొద్దామని కొన్ని థియేటర్‌లవాళ్లు పది టికెట్‌లమ్మేసరికే టికెట్‌లయిపోయి బయట గేటు అవతల టికెట్‌లు దొరుకుతూ వుంటాయి ఇంకా కొన్నిథియేటర్‌లుంటాయి. ఇందులో "కరదీపికధారులై" టిక్కెట్‌లు చూసి "జనాన్ని" [వారిభాష] సర్దేవాళ్లు సినిమా తెరకి ప్రేక్షకులకీ మధ్య అడ్డుగోడలై నిలబడతారు—ఎవరైనా కాస్త కూ: లేస్తే వరుసగా ఆ ఆట మొత్తం ఆ శాల్తీలకు తెరకనపడని విధంగా వాళ్ళొచ్చిపోయి గొడవ చేస్తారు

మరికొన్ని థియేటర్‌లలో ఫ్యాన్‌లు కేవలం గాలి విసరడమేకాదు పాటలు కూడా పాడుతుంటాయి! ఈ ఫ్యాన్ పాటల రొదలో సినిమా డైలాగులు వినిపించక కొందరు — ఫ్యాన్‌లు తెగి నెత్తిన పడతాయేమోనని కొందరు దుఃఖిస్తూ సినిమా చూస్తారు.

అయ్యా! "ఫ్యాన్‌ల" సంఘాలు, ప్రేక్షక కమిటీలు, అభిమాన సంఘాలు మొదలైన వాళ్లు కూడా యిలాంటి విషయాల మీద ఓ కన్నువేసి కాస్త దేశసేవ చేయాలి తప్ప సామాన్యుడు గోలెడితే ఏంలాభం? కనీస సదుపాయాలుగల హాళ్ళు పట్నాలలోనైనా వుండాలి అని మనం అంటే మానేవయ్యా చూడం అంటారు — సినిమాకి నాగా పెట్టలేంకదా సామాన్య ప్రాణులం.. అంచేత |***|

---

పరిష్కారాన్ని సూచించిన 'రాదారి పడవ' కథ చాల బాగుంది

**పరిధి:** వ్యక్తి కొన్ని సమయాల్లో స్వార్థ పరిధిలో ఆలోచించుతూ, సంఘానికి దూరంగా ఉండాలని ప్రయత్నిస్తూ ఉంటాడు అలాంటి సమయాల్లో అతని మనస్సు సంకుచితంగా కుచించుకుపోతూ, స్వార్థమనే పరిధిలో చివరికి తానొక్కడే మిగిలిపోయి మనసిచ్చే వ్యక్తులకు దూరంగా, ఒంటరి మనేదికూడ అప్పుడప్పుడు సంభవమవుతూ ఉంటుంది ఈ కథావస్తువుతో 'పరిధి' కథలోని కథారూపకల్పన సహజ చిత్రీకరణ, ఆదర్శమైన పాత్రలతో నేటి సంసారాల్లోని ఆర్థికస్థితిని, వరకట్న సమస్యను యధార్థంగా వర్ణించబడ్డది. కథలో రఘు పాత్రద్వారా, కథావస్తువును విశదీకరిస్తూ లక్ష్మి పాత్ర యొక్క సమస్యను (కథలోని సమస్యను) నరసింహం పాత్రధారిలో కథకు పరిష్కార మార్గం రూపొందించడమైనది.

## తృతీయ బహుమతి

(7వ పేజీ తరువాయి)

**మైనస్ బ్రతుకులు:** సంఘంలో కొందరి పెద్దమనుషుల స్వార్థం, కుటాలోచనలు అల్పాచారాల వెనుక దాగివున్న నిజాన్ని బహిరంగంగా, ధైర్యంగా చెప్పటానికి ముందు వచ్చే వ్యక్తులను అణగద్రొక్కుతూ, తమ కామవాంఛలను తీర్చుకొంటూ, ప్రతి రంగంలోను బహుదొడ్డ మనిషులుగా చెలామణి అయ్యే ఈ పెద్దమనుషులు, అంతరించిన తరువాత కూడ వాళ్ల అకృత్యాల వెనుక భయంకర సత్యాలను, కళ్లమూసిన నిజాలను బయటపెట్టినా నమ్మనటువంటి ఈ సంఘపు మనుషులు అలాంటివాళ్ళను పిచ్చివాళ్ళక్రింద జమకట్టి వాళ్ళ బ్రతుకులను మైనస్ బ్రతుకులుగా చేస్తున్నారు ఈ నగ్న సత్యాన్ని అతి సహజంగా, కరుణాజనితమైన శైలిలో 'మైనస్ బ్రతుకులు' కథలో రూపొందించబడినది.

**మిణుగురులు:** ఏదేని సమస్యలో వ్యక్తి జీవిస్తున్నప్పుడు, అతని స్థితిని మిణుగురులతో పోల్చవచ్చు వ్యక్తిని నిరాశతో ముందుకు నడిపింపజేసే శక్తే ఆశ ఆశే చీకటిలో ఎగిరే మిణుగు పురుగుల ప్రకాశం లాంటిది ఆశానిరాశలమధ్య ఉన్న నేటి యువతరం యొక్క ముఖ్య ఉద్యోగ సమస్యను ఈ కథలో రెండు ప్రధాన పాత్రలద్వారా యధార్థంగా, వాడుక పదజాలంలో, అంతరంగ భావుకతలో కూడుకొన్నట్టి చక్కని రచనా శైలిలో కథ రూపొందించటమైనది. "ఈ సమస్యా నిరాశలో ఆశకే స్థిరమైన స్థానం ఉంటుందని, దానితోనే వ్యక్తి, తను చేయగలిగే పనులు చేసి ఫలితం పొందగలుగుతాడు" అనే ఆదర్శ పరిష్కార మార్గానికి ఆశా జనకంగా! ముఖ్యంగా నేటి యువతరానికి చేరువగా వచ్చిన కథ ఇది. ★

**తలుపు తడుతోంటే అనిపించింది-మళ్లీ ఈరోజూ అదే జరగనుంది అని నాకూ, పార్వతికి ఈవిషయంలో గొడవ జరగటం పరపాటి అయిపోయింది.**

మొదట్లో అంతా తమాషాగా పోయినా, ఏ ఇంట్లో దొంగతనం జరిగినా, ఉండేది ఈ గొడవ కానీ తర్వాత దోపిడీ జరిగినా ఈ మా తగువు కొంచెం తర్వాత-అంటే, ఊళ్లో ఏదైనా అలజడి ఎక్కువ మోతాదులో ఉండేది జరిగినా, గొడవలు జరిగినా ఇవేవీ కాక పార్వతితో గొడవ అంటే నాకిష్టమే!



నాతో తగువు పడుతున్నపుడల్లా పార్వతి ఉపయోగించే మాటలు వినసొంపుగనూ, ఆ విన్యాసాలు కను విందుగానూ ఉంటాయి. అందుకే ఇద్దరమూ తరచు గొడవ పడేవాళ్లం. ఆ గొడవకూడా నీటిమీద మాటల్లాగ క్షణం గడవకముందే మాసి పోతుండేది

అయినా ఈ విషయంలో పార్వతి తప్పు లేదు పార్వతి నా భార్య ఏ భార్య అయినా తన భర్త క్షేమం కోరుకోవడం లోక సహజమే కదా!

తలుపు తట్టాడు—అసహనంగా

తలుపు తడుతోంటే చెయ్యి నెప్పిగా ఉంది. చేతికి ఉన్న బాండేజీలోంచి నా రక్తం నాకేసి చూస్తోంది

పార్వతి తలుపు తీసింది ఎవరు ఆ పేరు పెట్టారోగానీ, ఆ పేరుకు తగ్గట్టుగా శక్తి అవతారందరిస్తూ ఉంటుంది కొన్ని క్షణాలలో ఇరుగు, ఈ క్షణంలో ఆమె మళ్లీ ఆదిశక్తి అవతారంలో కనిపిస్తూనే ఉంది

నా ముఖం చూసి చిరునవ్వులు నవ్విన ముఖం, నా చేతికి ఉన్న బాండేజి చూడగానే అంతా ఎర్రగా మారిపోయింది

నాకు నవ్వొచ్చింది — నవ్వుతో బాటుగా లీలగా మనసులో గర్వమూ మెదిలింది

"అబ్బబ్బ!—ఏమిటండి ఇది మళ్లీనూ! మీరూ, మీ దిక్కుమాలిన ఉద్యోగం!! నా ప్రాణానికి వచ్చిపడింది ఈ పీడంతా! అయినా మీరు నామాట వింటారా, వినరా?"

పార్వతి అనబోయే మాట నాకు తెలుసు. ఆడదాని మాట విని ఏ మగవాడూ ఏ దేశం లోనూ బాగుపడ్డట్టుగా నిదర్శనాలు ఏ దేశ చరిత్రలోనూ లేవు నేనూ ఈ విషయంలో అంతే! పార్వతి మాట వింటే బాగుపడటం మాట అటుంచి నష్టపోవటం మాత్రం నిజం!!

—ఇంతకీ పార్వతి అనేది, ఉద్యోగం మానెయ్యమని!

ఉద్యోగం మానేసి ఏం చేయాలి??

"చెప్పండి బాబూ, నా మాట వింటారా, వినరా?"

"పార్వతీ" అనునయించబోయాను

"వద్దొద్దు. నాకు మీ సంజాయిషీలు వద్దు స్పష్టంగా చెప్పండి, మీరు వింటారా, వినరా?"

"పార్వతీ, ప్లీజ్ "

"ఇదుగో, నా మాట వినరుగదా మీరు! సరే అయితే– ఈ క్షణంలో చెబుతున్నాను రేపు రాజీనామా చేసి వస్తానని నాకు ఈ సాయంత్రంలోగా చెప్పకపోతే, ఈ రోజు రాత్రే నేనూ నా పిల్లలూ ఏ నుయ్యో గొయ్యో చూసుకోకపోతే — దొడ్డి నూతిలో పడకపోతే నా పేరు పార్వతే కాదు!" అని శపథం చేసింది పార్వతి.

నవ్వుకొన్నాను, తాటాకు చప్పుళ్లు!

నా నవ్వుచూసి, మండిపడింది పార్వతి – "నవ్వుతున్నారు గదా! నవ్వండి నా కళ్లల్లో ఉన్న బాధ మీకు తెలీదనే అనుకోనా? ఈ రోజున నవ్వుతున్న మీ కళ్లే, రేపు నా కోసం కన్నీళ్లతో " పార్వతి కంఠం జీరపోయింది.

"ఒకటడగనా పార్వతీ!–"

"అడగండి!"

"ఉద్యోగంమానేసి ఏంచెయ్యమంటావ్?"

"ఏదో ఒకటి ఈ ఉద్యోగం మాత్రం వద్దు!"

"ఏదో ఒకటి అంటే? – ఈ రోజున నెలకు మూడువందల జీతం ఇస్తున్న ఉద్యోగం ఇది! పాలు ఇస్తున్న ఆవును అమ్ముకోవటం తెలివితక్కువ పని!"

"నాకు మీకన్నా, మీరు తెచ్చే ఆ మూడు వందలు ఎక్కువకాదు ఈ ఉద్యోగం మానేస్తే ఈ ఇంటిని నేను పోషిస్తా – పదిళ్లల్లో పాచిపని చేసి. ."

నవ్వొచ్చింది నాకు– నన్ను నిక్షేపంలాంటి వుద్యోగం వదులుకోమని, తను పనిమనిషిగా చేరి, నన్నూ నా కుటుంబాన్నీ వుద్ధరిస్తానంటోంది పార్వతి!

"మీరు నవ్వుతున్నారుగదా, నా కళ్లల్లోంచి రక్తం కారుతోంది ఏపూట ఇంటికొస్తారో తెలీదు, ఎలావస్తారో తెలీదు, వెళ్లిన మనిషిని, మళ్లీ అలాగే చూడగలనా అనిపిస్తోంది! వద్దండీ నాకోసం అయినా మానేయండి!–"

పార్వతి కళ్లలో నీళ్లు, ఆ కంటినీళ్లల్లో నా నిర్ణయాలన్నీ పూచిక పుల్లల్లా కొట్టుకుపోతాయి. పార్వతి నిజంగా అంత బాధ పడుతోందా?

నాలో జీవితం పార్వతికి క్షణమో యుగం గానే వుంటోందా?

పార్వతే యింత కష్టం అనుభవిస్తోంటే యింకెవరికోసం చేయాలి ఈ ఉద్యోగం?

" ఊర్లో అందరి కష్టసుఖాలు చూడ్డానికే మీ వుద్యోగంగానీ, నా గురించి కానేకాదా ఏం? నా కష్టం ఆలోచించేది మీరు కాకపోతే ఎవరండీ?... వద్దండీ ఈ భయం బ్రతుకు నాకొద్దు ప్రాణాలు అరచేతో పట్టుకొని ఎలా బ్రతకమంటారు? ఓ పూట దోపిడీ, ఓపూట దొంగతనం, యింకోపూట దొమ్మీ-ఇవేవీ కాకపోతే, ఏ రాగుబోతుగురించో చెబుతారు మీకు చెప్పటం అనుభవించటం ఎలా వుంటుందోగానీ. ఈ విషయాలు వింటోంటేనే నా ప్రాణాలు ఏదో ఓ రోజున యిలాగే ఎగిరిపోతాయి! చూడండి, ఈ దెబ్బ, ఎంత రక్తం పోయిందో, ఏమిటో!–"

"ఆ, ఏమీ కాలేదు పార్వతీ! హాస్పిటల్‌కు వెళ్లి మందు వేయించుకొనే వచ్చాకదా!"

"పోవాల్సినంత రక్తం పోయాకే కదా!"

"అదికాదు పార్వతీ–రక్తం ఏమీ పోలేదు ఏదో చిన్న కత్తిపోటు అంతే!"

"మీకేం చిన్న కత్తిపోటని ఎంత తేలికగా చెబుతున్నారో... అది ఆ భుజం మీద కాక కొంచెం పక్కగా ఆ గుండెకే తగిలి వుంటే– వద్దండీ– నా మాట వినండీ, ఈ పాడు వుద్యోగం వదిలేయండి, ప్లీజ్..."

–పార్వతిని యింత కష్టపెట్టి, నేనేం బావుకోను?

పార్వతి కోరినట్లుగానే... ఈ పోలీసు వుద్యోగానికి రాజీనామా యివ్వాలనే నిర్ణయించుకొన్నాను.

* ● *

ఉన్నట్లుండి మెలకువ వచ్చింది నాకు. కళ్లు తెరిచాను, మంచంమీద నా ప్రక్కనే పార్వతి ఒకచేయి నా గుండెమీద వేసి నిశ్చింతగా నిద్రపోతోంది ఉయ్యాలలో చిట్టిగాడు, ఆ ఉయ్యాలకిందే వేవీ...ఇదీ నా ప్రపంచం. ఈ నా స్వంత ప్రపంచం ఇపుడు నిశ్చింతగా ఉంది.




పార్వతికి నిన్న ఇచ్చిన మాట గుర్తొచ్చింది ఈ రోజున ఇంత నిశ్చింతగా నిద్రపోతున్న నా ప్రపంచంలో, రేపు నేను రాజీనామా చేసివస్తే, వచ్చే అలజడి నాకు తెలీందీ కాదు, ఊహించుకోలేనిదీ కాదు.

ఊర్లో జరిగే అలజడులను ఆప ప్రయత్నించగలనుగానీ – నా స్వంత కుటుంబంలో ఆ అలజడివస్తే, ఆపటం నా తరం కానే కాదు

కానీ ... పార్వతి చెప్పేదీ నిజమే! ప్రాణాలు అరచేతో పట్టుకొని ఎంతకాలం బ్రతుకుతుంది తను? జరగాల్సిందేదో జరిగే తీరుతుంది నిర్ణయించుకొన్నట్లుగానే ఉద్యోగానికి రాజీనామా చేసితీరాలి

ఎదురుగా హేంగర్‌కు వేళ్లాడుతూన్న నా యూనిఫారం నాకేసి అదోలా చూస్తోంది. బాధగావున్నా తప్పదు మరి!

కోళ్ళు కూసాక, చుక్కలన్నీ తప్పుకొన్నాక, నిర్మలమైన వెలుగు అంతటా అలముకొన్నాక పార్వతి లేచింది నవ్వుతూ! ఎంత ప్రశాంతంగా ఉంది ఈ క్షణంలో!

"ఈ రోజేకదా .." నిద్రలేస్తూ అడిగింది పార్వతి.

"ఆ గుర్తుంది, వెళ్లి రాజీనామా ఇచ్చి వస్తాను!" అన్నాను నేను నిజంగా.

పార్వతి త్వర త్వరగా కాఫీ కాచి ఇచ్చింది. కాఫీ తాగుతున్నంసేపూ పార్వతి నాకేసి ఆపేక్షగా చూడటం గమనిస్తూనే ఉన్నాను. పార్వతిలో ఇంతటి సంతృప్తిచూసి ఎంత కాలం అయిందోగదా!

# పార్వతి అడగని ప్రశ్న

కాఫీ తాగటం పూర్తి అయాక, వేణ్ణీళ్ళు కాచింది. బేండేజీ విప్పి, నిన్న తగిలిన గాయాన్ని సున్నితంగా తుడుస్తోంది ఆ స్పర్శలో ఎంత ప్రేమ, ఎంత ఆప్యాయత!

"చూడండి. ఎంత గాయం తగిలిందో! నా అదృష్టం బాగుండిపోయింది కానీ లేక పోతే, వద్దులెండి బాబూ. ఆ ఉద్యోగాని కీ రోజునే "

పార్వతి అంటూన్న మాటలు వింటూ గాయాన్ని చూశాను పెద్ద బలమైన గాయం కాదుకానీ, పార్వతి ఆడది పైగా నా భార్య నాకు తగిలిన గాయం పార్వతికి పెద్దదిగానే కనిపిస్తుంది

మనసులోనే నవ్వుకొన్నాను.

– ఎవరో పిలుస్తున్నట్లుగా అనిపించి, అటుకేసి చూశాను అవును, ఎవరో వచ్చారు పార్వతి కాపడం పెట్టటం ఆపి, ముందు గదిలోకి వెళ్ళింది

"మీకోసం ఎవరో వచ్చారు!" అంది పార్వతి

తువ్వాలు వొంటిమీద వేసుకొని ముందు ఎవరో ఓ నలభై ఏళ్లవ్యక్తి–అతని భార్య కాబోలు ఒకావిడ వచ్చారు

"వెంకటేశ్వర్లుగారు మీరేనాండీ ?"

ఔనన్నట్టుగా తలవూపి లోపలకు ఆహ్వా నించాను ఇద్దరూ లోపలకు వచ్చారు

ఉన్నది ఒకటే గది గది మధ్యలో వుయ్యాల ఉయ్యాలలో చిట్టిగాడు ఉయ్యాలకింద బేబీ వాళ్లనెక్కడ కూర్చో బెట్టాలో అర్థంకాక క్షణం తికమకపడ్డాను పార్వతి నా బాధ అర్థం చేసుకొని మంచంకేసి చూపించింది.

"కూర్చోండి" అన్నాను

కూర్చుంటూ అన్నారాయన "బాబూ. నా పేరు సుబ్బయ్య నిన్న రాత్రి మీకు గాయం తగిలింది మా యింట్లోనే!"

ఆవిడ అందుకొంది : "దేవుడిలా వచ్చి ఆదుకొన్నావు బాబూ! వచ్చే సోమవారంనాడు మా అమ్మాయి పెళ్లి. ఆ పెళ్లికి ఇంట్లో జరుగుతున్న హడావిడి గమనించాడు కాబోలు, నిన్న రాత్రి కన్నం వేశాడు దొంగ వెధవ! మీరు దేవుడిలా ఆ క్షణంలో ఆదుకోకపోతే మా అమ్మాయి పెళ్లి ఆగిపోయే వుండేది! మీ ఋణం ఏ జన్మలోనూ తీర్చుకోలేం నాయనా!"

నాలో గర్వం తొణికిసలాడింది– దాన్ని కప్పిపుచ్చుకొంటూ అన్నాను – "దానిదేముం దండీ, అది నా డ్యూటీ!"

"డ్యూటీ అయినా ఈ కాలంలో చేసే వాళ్లెందరు? మాకోసమేగదా, ఆ కత్తి పోటుకు కూడా గురి కావల్సి వచ్చింది!"

నేనేమీ అనలేకపోయాను

"మూడు, నాలుగు వేల రూపాయల నగదు, చీరలు అన్నీ దొరికిపోయాయి మా వస్తువులే అయినా, నిధి దొరికినట్లుగావుంది మాకు! అందుకే ." ఆవిడ ఏమంటోందో నని అటుకేసి చూశాను

"మా కన్న కొడుకులా మా అమ్మాయి పెళ్లి నిలబెట్టావు నాయనా! అందుకే ఏదో మా తృప్తికొద్దీ యిదిగో, ఈ చీర . మా అమ్మాయి పెళ్లికోసం కొన్నదే! మీకిచ్చి మా కృతజ్ఞత చెప్పిపోదామని వచ్చాం!" అంటూ సంచీలోంచి పట్టుచీర తీసింది ఆవిడ

పార్వతీ, నేనూ ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాము

" . ఇదుగో, ఈ యాభై రూపాయల రొక్కం కూడా వుంచు నాయనా!" అంటూ అందించబోయాడు ఆయన

ముందుగా నేను తేరుకొన్నాను "క్షమిం చండి మీకు నేను చేసింది అంటూ ఏదైనా ఉంటే అది నావిధి అంతే కాని "

"సరే, మీ విధే కావచ్చు కానీ ఇది మా సంతోషంకొద్దీ ఇస్తున్న కానుక! మాయిల్లు నిలబెట్టావు — వద్దనకు! సెలవ్, మా అమ్మాయి పెళ్లికి మళ్లీ వచ్చి పిలుస్తాం! తప్పకుండా రండి!" అంటూ వాళ్లు ఇద్దరూ లేచి నిలబడ్డారు.

వాళ్లు ఇద్దరూ బయిటకొచ్చేంత వరకూ ఉండి, లోపలకు వచ్చి బట్టలు వేసుకో బోయాను

"అవికాదండీ — ఇవి!" అంటూ పార్వతి యూనిఫారం అందిస్తోంటే ఆశ్చర్యంతో పార్వతిని చూశాను పార్వతికళ్లు ఆనందంగా మెరుస్తోంటే, తృప్తిగా యూనిఫారం అందు కొన్నాను

ఆ తర్వాత ఎపుడూ పార్వతి నన్ను 'రాజీ నామా ఎపుడు చేస్తారు ?' అని అడగనే లేదు

# వంటలు

## గుమ్మడికాయ బూరెలు :

కావలసిన వస్తువులు :—

బియ్యం — 1/4 కిలో, గుమ్మడి కాయ— 1 చిన్న చెక్క, బెల్లం—1/8 కిలో.

పద్ధతి :— ముందుగ గుమ్మడికాయని సన్నగ దోసచెక్కులా తరిగి ఉంచుకోవాలి. ఈ వంటకం చేయడానికి గంటముందే బియ్యాన్ని నానపోసుకోవాలి. బియ్యం నానాక దానిని మెత్తగ పిండికొట్టి ఒక గిన్నెలోపోసి అందులో ఈ బెల్లం కలపాలి. గట్టిగఉండే ఈ ముద్దలో నుంచి కొంచెం తీసి వేరేగిన్నెలో వేసి తోపులా గింజె జారుగ కలుపుకోవాలి. మిగిలిన ముద్దలో ఈ గుమ్మడిచెక్కవేసి బాగా కలియబెట్టి ఆ ముద్దని చిన్న చిన్న ఉండలుగ చేసుకోవాలి. అప్పుడు బాణలిలో నూనె మరగబెట్టి మరుగుతున్న నూనెలో ఈ ఉండలను తోపులో ముంచి, వేయించాలి. ఎర్రగ వేగిన తరువాత తీసెయ్యాలి. కావలసివారు ఇందులో బెల్లానికి బదులుగ పంచదారను ఉపయోగించవచ్చు

## కాబేజీతో గారెలు .—

కావలసినవి .— మినుపపప్పు — 1/4 కిలో, కాబేజీబుట్ట—చిన్నసైజుది 1, ఉల్లిపాయలు—పెద్దవి 4, పచ్చిమిరపకాయలు—6, ఎండుకారం—2 స్పూనులు, ఉప్పు—తగినంత.

పద్ధతి :— ఈ వంటకం చేయడానికి తొలిరోజు రాత్రే మినుపపప్పు నానపోసుకోవాలి. మధ్యాహ్నం టిఫిన్‌గా చేసుకోవాలంటే ఉదయాన్నే నానపోసుకోవచ్చు పప్పు నానాక దానిని మెత్తగా పోసి రుబ్బి ఉంచాలి అప్పుడు కాబేజీని సన్నగ చెక్కు తరుగుకోవాలి. ఉల్లిపాయల్ని కూడా చెక్కు తరుగుకోవాలి. పచ్చిమిరపకాయలు, ఉప్పు, ఎండుకారం కలిపి దంచి ఆ ముద్దను చోవిలో కలపాలి. తరువాత కాబేజీ చెక్కు, ఉల్లిపాయ చెక్కు కలపాలి. బాణలిలో నూనె మరగించి అందులో ఈ ముద్దను గారెలలాగా నొక్కి వేసి వేయించాలి.

—పేరి విజయలక్ష్మి (విజయనగరం)








భక్తిని గురించి చెపుతూ ఒకప్పుడు శ్రీ రామ కృష్ణ పరమహంస ఈ గాథను తెలియజేశారు

తానే గొప్ప విష్ణుభక్తుడననీ, తన్ను మించినవారు మరొకరు లేరని అర్జునుడి మనస్సులో ఒక గర్వం ప్రవేశించింది దానిని శ్రీకృష్ణుడు గ్రహించి ఏమీ తెలియనట్లు నటించి, విహారానికంటూ అర్జునుడిని ఒక వనానికి తీసుకు వెళ్ళాడు ఆ వనంలో వారికి ఒక యోగి కానవచ్చాడు జీవహింస సుతరామూ అతనికి కిట్టదు. ప్రాణం ఉన్నదనే భావనతో పచ్చిగడ్డిని కూడా తినక ఎండుగడ్డిని మాత్రం ఆహారంగా స్వీకరిస్తూ వున్నా, చేతిలో ఒక వాడి కత్తిని ధరించి వున్నాడు

అది చూడగా అర్జునుడికి మిక్కిలి ఆశ్చర్యం కలిగింది అణుమాత్రం జీవహింసను సహించని ఆ యోగి కత్తినెందుకు పట్టుకున్నాడు ? అర్జునుడికి బోధపడలేదు కారణాన్ని శ్రీకృష్ణుణ్ణి ప్రశ్నించాడు శ్రీకృష్ణుడు

## నలుగురు హంతవ్యులు

"ఆ యోగినే అడుగు" అన్నాడు. కత్తిని ధరించడానికి కారణమేమిటి?"అని అర్జునుడు అడగ్గా ఆ యోగి "నాకు కనబడినట్లయితే నలుగురిని చంపడానికి ఈ ఖడ్గాన్ని ధరించాను" అన్నాడు

'ఆ నలుగురూ ఎవరు ? వారిని ఎందుకు చంపదలచావు?' అని అర్జునుడు ప్రశ్నింపగా— ఆ యోగి ఇలా వివరంగా చెప్పాడు

"నేను చంపదలచిన మొదటి వ్యక్తి నారదుడు నారదుడు ఎప్పుడూ నా స్వామిపై పాటలు పాడుతూ చికాకు పరుస్తాడు తెల్లవాయజామున నా స్వామి గాఢనిద్రలో ఉండగా మేలుకొలుపులు పాడి నిద్రాభంగం కలిగిస్తాడు. ఇట్టి అపరాధానికి మరణమే తగిన శిక్ష"

రెండోవ్యక్తి ప్రహ్లాదుడు హిరణ్యకశిపుడు పాములచేత కరిపించినా, ఏనుగులచేత త్రొక్కించినా, కొండమీదనుండి కిందికి తోయించినా ప్రహ్లాదుడికి అపాయం కలగలేదు. భక్తుడికోసం ఆ బాధలనన్నీ నా స్వామియే అనుభవించాడు గదా! తన ప్రభువు ఇలా బాధ పడడానికి కారకుడైన ప్రహ్లాదుణ్ణి చంపాలా, వద్దా ? నీవే చెప్పు

మూడవ వ్యక్తి ద్రౌపది నా ప్రభువు భోజనానికి విస్తరి ముందు కూర్చున్న సమయంలో ఆమె తమ్మందరినీ దూర్వాసుడి శాపంనుండి తప్పించాలని ప్రార్థించింది నా స్వామి తిండి మానివేసి, ఆ ఆహారాన్ని ద్రౌపదికి అందజెయ్యవలసి వచ్చింది ఆయనను విస్తరిముందునుంచి లేవగొట్టిన మహాపరాధానికి మరణశిక్ష చాలా తక్కువైనదే!

నాల్గవ వ్యక్తి అర్జునుడు ఆ మహా పాపి నా ప్రభువును యుద్ధ రంగంలో తనకు సారథిగా చేసుకోవడం ఏమైనా న్యాయంగా ఉన్నదా ? మొదటి దెబ్బ నా స్వామికే గదా తగులుతుంది ? తా నేమో సుఖంగా వుండ వచ్చా ? ఈ మహాపరాధానికి మరణమే ప్రాయశ్చిత్తం.

వీరందరూ నాకు కనబడకుండా తప్పించుకుంటున్నారు — కనడితే — మరి ఉండరు"

మహాభక్తులుగా పేరుపడిన వారినే మహాపరాధులుగా ఆ యోగి నిర్ణయించి, తగిన కారణాలు చూపడంవల్ల అర్జునుడు బదులు చెప్పలేక తల వంచుకోవలసి వచ్చినది అతని మనస్సులోని గర్వం, అహంకారం పూర్తిగా నశించాయి

---

తండ్రి నిర్ణయాన్ని అనుసరించి జీవితాన్ని ఊహించుకుంది దాని నిండా ముళ్ళడొంకలు అడుగడుగునా అడ్డంకులు. గుండెను పిండి చేస్తున్నట్లు కనిపిస్తున్న భయంకరమైన దృశ్యాలు!

"లేదు తన యిష్టానికి వ్యతిరేకంగా తను ప్రవర్తించలేదు తనవాళ్ళు చూపుతున్న దారిలో తను పయనించలేదు . తలిదండ్రుల యిష్టాలకి తను బలి కాలేదు .. తన ఆశల్ని, కోరికలని, వ్యక్తిత్వాన్ని చంపుకుని తను బ్రతకలేదు తన జీవితాన్ని తనే చేజేతులా నాశనం చేసుకోలేదు!"

బరువైన మనస్సులో, మంచం మీద పడుకున్న కృష్ణవేణి కృష్ణవేణి నిండా ఆవరించిన భయం కళ్ళముందు గిర్రున తిరుగుతున్న నాలుగేళ్ళ క్రిందటి గతం ..

"ఆట కట్టు!" బంటుతో రాజును దాటడానికి వీలులేకుండా చేసి అన్నాడు రాజు.

# వెలుగు బాట

(18వ పేజీ తరువాయి)

"రాజా! మరి నీతో ఆడలేను ఎన్ని సార్లు ఆడినా నీ ఆటమాత్రం కట్టించలేక పోతున్నాను మరో గేమ్ ఆడదామా ?" అన్నాడు శంకరం

"నేను చదువుకోవాలండీ! మరేమనుకోకపోతే లేచిపోతే నేను లేచి పోవాలనుకుంటున్నాను" అన్నాడు రాజు

"అచ్చా అలాగే కాని" అని ఒళ్ళు బద్ధకంగా విరుచుకుని 'వస్తా' అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అంతలో అక్కడకు వచ్చిన వాణి రాజూ! "మనిద్దరం ఒక ఆట ఆడదామా ?" అంది

'నీతోనా ?"

"ఏం నాతోనే ఆమాత్రం ఆట రాదనుకున్నావా ?" అంది చిరుకోపంతో.

"అబ్బే ఎంతమాట ? నీకాట రాదంటే ఒప్పుకుంటావా ?" వాణి వేపు కొంటెగా చూస్తూ అన్నాడు

"సరే రా ఒక దెబ్బతో నీ 'రాజు'ని కట్టించకపోతే చూడు" అని చదరంగపు పిక్కలు డొక్కులోంచి క్రిందికి ఒంపింది

"మహాతల్లీ నువ్వు బాగా ఆడగలవ్ నీతో నేనాడలేను ఒప్పుకున్నాలే నన్ను విడిచిపెట్టు నేను చదువుకోవాలి!" అన్నాడు

"వీల్లేదు నాతో ఆడాల్సిందే"

"ప్లీజ్ వాణి నేను చదువుకోవాలి!"

"నో నాతో ఆడాల్సిందే'

"అయితే ఆడు! నీ పని చెపుతాను" చదరంగం పిక్కల్ని తీసికొని పావుగంట దాటకముందే వాణి ఆట కట్టించేసాడు. కళ్ళలోకి చూస్తూ "అమ్మాయిగారి ఆట! కట్టు," అని "నీతో నేనెక్కడ ఆడగలను ?

్యంత ఆటకత్తెవు ? నువ్వేసిన ఎత్తుని
ోకోగలనా అసలు" వాణిని ఏడిపిస్తూ
న్నా అన్నాడు రాజు.
"సరే. చదరంగంలో గెలిచేసినంత
్రతాన సరిపోయిందేమిటి? కేరమ్స్

## వెలుగుబాట

ఆడుదాం రా!" అంది ఓటమిని అంగీక
రించకుండా.

"నేనూ ఆడతానక్కా!" అక్కడే

చదువుకుంటున్న కృష్ణవేణి పుస్తకం పడేసి
అంది.

"నువ్వు చదువుకోలే వెళ్లు పరీక్షలు
దగ్గర్లోనే ఉన్నాయి కూడా." అని కేరమ్సు
బోర్డు కోయిన్సు పట్టుకుని వచ్చింది రాజుకి

# వెలుగు బాట

వాణిని ఏడిపించటం, వాణి అలిగి కూర్చుంటే బుజ్జగించటం సరదా అయిన అలవాటు.

"సరే. రెండు బోర్డులు ఎవరిదైతే వాళ్లదే గేమ్." అన్నాడు

"అల్లాగేం వీల్లేదు. పూర్తిగేం ఆడాల్సిందే"

"అలాగైతే నేనుండను."

"పోసి. నీ యిష్టమే" అన్ని కోయిన్సు సెట్ చేసింది మొదటి బోర్డు రాజా గెలిచాడు. మళ్లీ రెండో బోర్డులో, వాణి గెలిచింది. నాలుగు పాయింట్లు ఇద్దరికి సమానంగా వచ్చాయి.

పట్టరానిసంతోషంతో కేకలేస్తూ "రాజాని ఓడించేశా!" అంది రాజు వాణి వేపు చూసి "అమ్మాయిగారూ! బోర్డుకి బోర్డు చెల్లు. పాయింట్లు కూడా సమానమే కాబట్టి ఈ బోర్డు ఎవరికొస్తే వాళ్లదే గేమ్" గేమ్‌ను చాలా సిన్సియర్‌గా ఆడసాగింది వాణి ఇద్దరికీ ఒక్కొక్క కోయినూ, రెడ్ కోయినుమాత్రం బోర్డుమీద మిగిలాయి. స్ట్రయికర్‌ను ఒకసారి పట్టుకుని, తదేకంగా ఆలోచిస్తూ ఏదో అయిడియా వచ్చినట్టు స్ట్రయికర్‌ను లైన్సు మీద సమంగా సెట్ చేస్తూ రెడ్ కోయిన్ గట్టిగా స్ట్రోకిచ్చింది. కాని ఆ దెబ్బ పక్కనున్న వైట్‌కి తగలటంతో ఫోర్సుగా వెళ్లి హోలులో పడిపోయింది.

"బర్న్...బర్న్..." సంతోషంలోగట్టిగా కేక వేశాడు రాజా. వాణి కోపంలో స్ట్రయికర్‌ను బోర్డుకేసి కొట్టింది

"ఎవరు రాజా! ఎవరి చేతిలో బర్నయింది?" అని అడిగింది ఈ ప్రక్కనే చదువుకుంటున్న కృష్ణవేణి

"ఇదిగో. ఈ ఛాంపియన్‌గారి చేతిలో" అన్నాడు వాణిని చూపెడుతూ.

"అక్కా! మరి రాజాతో నువ్వాడలేవక్కా" అంది కృష్ణవేణి

"నువ్వు నోర్మూసుకోవే ఎవా చెప్పొచ్చావ్?" ఓటమి సంగీకరించలని అవమానంతో కసిరింది వాణి కృష్ణవేణి మళ్లీ పుస్తకం చదవటంలో లీనమైపోయింది.

"అమ్మాయిగారికి అప్పుడే బాగా కోపం వచ్చేసినట్టుందే" వాణి ముఖాన్ని రెండుచేతుల్లోకి తీసుకొని, కళ్లలోకి చూస్తూ అన్నాడు రాజు.

సినిమా తారలంటే యిష్టంలేదని చెప్పుతున్న పన్నాల విజయ సారధి కొత్త రచయితల రచనలుకూడా చదవాలే నంటున్నాడు.



రావిశాస్త్రి, బీనాదేవి, కొ. కు. గారలు (అతను వాడిన సంక్షిప్త నామాలేయివి) యితనికి అభిమాన రచయితలు, ముత్యాలముగ్గులో హీరో హీరోయినులున్న సన్నివేశాలుతప్ప అంతా బాగుంది.ఇతనికి హరిశ్చంద్రుడంటే 'చవట' అని నమ్మకం. క్రికెట్ ఆడతానని చెప్పాడు. ఇతరులను ఏడిపించి తద్వారా ఆనందాన్ని పొందటం రాక్షసత్వం అనిపించుకుంటుంది కనుక ఆడపిల్లల్ని ఏడిపించ నంటున్నాడీ బి ఏ సెకండియర్ విద్యార్థి [ హైదిహై వాళ్ల కాలేజీ రో ఒన్మూమాయి లుండరు అది లయోలా విజయవాడ కళాశాల ] ఈ-ర, స్టాంపుల సేకరణ ఉత్తరాలు రాయడం లాంటివి యీ అబ్బాయి హాబీలు. బి ఏ ప్యాసై ఎం ఏ చదువు కుంటానంటున్నాడు ఫస్టుక్లాసు వస్తుందని ఆశిద్దాం. ★

# యువతరం

శాతవాహనా కాలేజీ పంచాయితీ కార్యదర్శి ఎం. జనార్ధనరావు అన్ని తెలుగు సినిమాలు చూస్తాడు. వాళ్లింటికి అన్ని పత్రికలు



వస్తాయి కనుక యీ సెకండ్ బి కాం విద్యార్థి మాగజైన్ల దినపత్రికలు చదవటానికి లైబ్రరీకి వెళ్లడు. ఆటలన్నా సినీమా తారలని చూడాలన్నా సర్దా లేదు కాలేజి వాళ్లింటికి దగ్గరగా వుంది కనుక యింటి పనులు ఏవీ ఎక్కువగా చేయడు గనుక యీ జనార్ధనరావు బయట అరుదుగా తిరుగుతా నంటున్నాడు కాని యితనికి ముఖ్యమైన సరదా ఒకటి వుంది నాటకాలు వేస్తాడు కాలేజీలో వేశాడుకూడా కాని ఏదీ అలవాటు చేసుకోకూడదన్నది యితని సిద్ధాంతం మంచిదేకదా ★

హైద్రాబాద్‌లో బి కాం చదువుకుంటున్న టొంచరవోయిన వైవాధిసం



ముదిరాజ్ మంచి స్నేహాన్ని గౌరవిస్తూ అప్పుడప్పుడు రచనలు చేస్తూంటాడు. ఈ యువకుడు రాసిన చాలా నాటికలు ఆకాశవాణి యువవాణి విన్యాసం ప్రసారం చేసింది. రేడియో కథలు కూడా యితని హాబీ. కలం స్నేహం చేస్తాడు చాలామందితో. ఒక్కరోజు గ్రంథాలయం మానేశాడో "ఏదో పోయిందని" వర్రీ అయిపోతాట్ట లంబ్రైబ్రీ పిచ్చి సౌందర్యంకన్నా గుణం ప్రాధాన్యతను వాదించే వైవాదీసం "చేసేది ఏదో చేసెయి సూటిగా" అని ప్రస్తుతం చదువేదో చదువుకుంటాడు తప్ప తర్వాతి ప్లాన్లు స్పెట్యులేషను వేయడు, నాటకాలో వేషాలు కూడా వేసే యీ అబ్బాయికి రచయిత కావాలన్న కృషి ప్రధానాశయం. "నేటి రాజ్యాంగ విధానం ఫర్వాలేదని" విశ్వాసం. ★★★

"క్ష చెల్లి కనిపించటంలేదూ!" మెల్లిగా గొణిగింది వాణి

"ఫరవాలేదు. పుస్తకంలో లీనమైపోయింది కృష్ణ" అని వాణి నుదుటపై ముద్దు పెట్టుకున్నాడు రాజు. అదే సమయానికి అటు చూసిన కృష్ణవేణికి వాళ్లిద్దరూ లొలిసారిగా అర్ధమయారు

* * *

"నాకీ పెళ్లి ఇష్టంలేదు" నిష్కర్షగా ఏమాత్రం భయపడకుండా చెప్పిన వాణిని చూస్తుంటే రామచంద్రరావుగారికే కాకుండా అందరికీ ఆశ్చర్యం వేసిందా యింట్లో. రామచంద్రరావుగారికి అయిదుగురు కొడుకుల్లో ఏ ఒక్కరుగాని, అలాగా, అంత కుండబద్దలు కొట్టినట్లుగా ఎప్పుడూ చెప్పినట్లు వుండలేదు. వాణి మాటలకు రామచంద్రరావు గారికి చెప్పరాని కోపం వస్తున్న సంగతి చూస్తూ వున్న కొడుకులకీ, కోడళ్లకీ,భార్యకీ అందరికీ తెలియటంచేత వాళ్లెవరూ నోరు విడిచి మాటకూడా ఆడలేకపోయారు.

"ఎందుకని ?" కళ్లెర్ర చేస్తూ ప్రశ్నించారతను

"నేను రాజుని ప్రేమించాను. అతణ్నే పెళ్లి చేసుకుంటాను అలా కాని నాడు నాకు పెళ్లే అక్కరలేదు" తలవంచుకుంటూనే సమాధానం చెప్పింది రామచంద్రరావు వస్తున్న కోపాన్ని మనసులో దిగమింగుకుంటూ కోపానికి ఇపుడు సమయం కాదని భావించి, అనునయంగా, "అమ్మా! నా మాట విను తల్లీ" అన్నారు

వాణి కదలకుండా అలాగే స్తంభానికి చారబడి ఉండిపోయింది

(ఇంకా వుంది)



### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన లందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.

### గ్రంథస్వీకారం గమనిక

స్థలాభావంచేత గ్రంథ స్వీకారం మాత్రమే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అప్పుడప్పుడు వేయగలుగుతున్నాము పుస్తకాల శీర్షిక క్రింద సుదీర్ఘమైన సమీక్షలు సాధ్యం కావు గ్రంథస్వీకారం శీర్షికకి పంపేవారు రెండు ప్రతులు పంపవలసి వుంటుంది దీనికి సంబంధించి ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా సాధ్యంకానిపని అని మనవి —సం.



# హైదరాబాద్ నోట్ బుక్

### వహవ్వా నారాయణప్ప !

"వినాయకో విఘ్నరాజా
ద్వైమాతురగణాధిపా
అప్యేకదంత హేరంబా
లంబోదర గజాననా ?"

అని ఆరున్నరశ్రుతిలో గొంతెత్తాడు సిందెనారాయణప్ప మార్చి 21వ తేదీ సాయంకాలం. సంగీతనాటక అకాడమీ హాలు దద్దరిల్లిపోయింది పురుషత్వం పొంగిపొర్లే ఆ కంఠంతోపాటే కిన్నెర కంఠం కలిపింది, అతని భార్య శ్రీమతి శాంతమ్మ పక్కవాద్యం వాయించాడు కొత్తపల్లి అంజనెప్ప అది జానెడు, జిత్తేడు ముఖవీణ నారాయణప్ప పాడుతూనే మృదంగం వాయిస్తాడు. శాంతమ్మ తాళం వేస్తుంది మొత్తం వాద్యాలు మూడు మొత్తం కళాకారులుముగ్గురు వేరసిముగ్గురు. ఈ ముగ్గురే యూరోపులో తోలుబొమ్మల సుందరకాండను ప్రదర్శించారు. ఇంత నిరాడంబరమైన వాద్యాలతో వేలాది ప్రేక్షకులకు అంతటి ఆనందం ఎలా కలిగించగలిగారు అని పాశ్చాత్యులు విస్తుపోయేటట్లు చేయగలిగారు. ఈ బృందం ఛాయా థియేటర్స్ పక్షాన ఫ్రాన్సులోని రెన్‌నగరంలో జరిగిన అంతర్జాతీయ సాంప్రదాయక కళాప్రదర్శన మహోత్సవంలో పాల్గొని, ఆంధ్రప్రదేశ్‌కు, భారతదేశానికి గొప్ప కీర్తి సంపాదించి పారిస్, ఆంస్టెర్‌డామ్, బెర్లిన్ మొదలైన చోట్ల మొత్తం ఇరవై ప్రదర్శనలిచ్చి విజయ ధ్వజ తో తిరిగి వచ్చింది సంగీత నాటక అకాడమీ ఈ విజయయాత్ర పురస్కరించుకుని మార్చి 21న, యీ బృందాన్ని సత్కరించింది ఈ బృందానికి ప్రముఖ నటుడు, నాటక, నాటకరంగ నిపుణుడు శ్రీ ఎ. ఆర్. కృష్ణ, తోలుబొమ్మల నిపుణుడు శ్రీ ఎం. వి రమణమూర్తి నాయకత్వం వహించారు. సన్మాన సభకు అధికార భాషాకమిషన్ అధ్యక్షులు సంచార విజ్ఞాన సర్వస్వం శ్రీ వావిలాలగోపాలకృష్ణయ్య అధ్యక్షత వహించారు. సంగీత నాటక అకాడమీ సంయుక్త కార్యదర్శి శ్రీ కృష్ణంరాజు స్వాగతం చెప్పారు. శ్రీ ఎ ఆర్. కృష్ణ ప్రసంగిస్తూ తమ బృందానికి పోయినచోటెల్లా కలిగిన ఆదరసత్కారాలు వివరించారు. రామాయణం పట్ల పాశ్చాత్యులకు విశేషశ్రద్ధ ఉన్నదని, మన రంగులతోలుబొమ్మలు నారాయణప్ప దంపతుల సంగీతం వారిని విశేషంగా ఆకర్షించాయని ప్రదర్శనానంతరం బృందాన్ని చూచివారు మరింత ఆశ్చర్య పడ్డారని అన్నారు అక్కడ దాదాపు 300 తోలుబొమ్మలు అమ్ముడు పోయాయని కూడా ఆయన అన్నారు. ఈసారి అక్టోబరులో మరొకమారు యూరోప్‌యాత్ర చేస్తామన్నారు. ఫ్రెంచి ప్రేక్షకులు రామాయణ ఆట చూస్తున్నంతసేపు, సంగీతం వింటున్నంతసేపు భారత దేశంలో ఉన్నట్టే తన్మయులై పోయారని, బెర్లిన్‌లో ప్రేక్షకులను అదుపులో పెట్టడానికి పోలీసుల సహాయం పొందవలసి వచ్చి దని ఆయన తెలిపారు శ్రీ నటరాజ రామకృష్ణ, డాక్టర్ డి కె రావు, ఏకా సుబ్బారావు, శ్రీ సీతారామయ్య కళాకారులను, కృష్ణను ప్రశంసించారు నారాయణప్ప, శాంతమ్మ, అంజనప్ప తమ పరిమిత భాషలో తమ అనుభవాలు చెప్పారు "వాళ్ళ గౌరవం, వాళ్ళఆదరణ గొప్పవి అన్నది శాంతమ్మ శ్రీ గోపాలకృష్ణయ్య తోలుబొమ్మలాటవంటి కళను కాపాడడం అవసరమని, ప్రభుత్వం, అకాడమీలు దీనిని ప్రోత్సహించాలని తమ మిత్రులకు లలో అన్నారు సంగీత నాటక అకాడెమీ సాధ్యమైనంత సహాయం చేస్తుందని కృష్ణంరాజు హామీ యిచ్చారు. వందన సమర్పణతో

### అందరూ కళాకారులే

ఇంటిల్లిపాదీ కళాకారులు కావడం అరుదు అలాటి అరుదైన సంగతే శ్రీ మనోహర్‌దత్ కుటుంబం. ఆయన, ఆయన సతీమణి, నాలుగు వరెళ్ల కుమార్తె అందరూ కళాకారులే మనోహర్‌దత్ స్నాతకోత్తర శిక్షణ పొందినవారు హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ బంగారు పతకం, ఎరెన్నో సన్మానాలు, అవార్డులు పొందినవారు ఎన్నో సమిష్టి వ్యష్టి ప్రదర్శనలలో పాల్గొన్నారు జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం లలితకళ శాఖ అధ్యాపకులు నిరంతరం చైతన్యం వి సిల్వే వ్యక్తిత్వం , సరసత, కృష్ణా జిల్లావారైనా విశాలాంధ్ర దృష్టితో అడిగినప్పుడల్లా ఏదో ఒకటి చెప్పే హాస్యం క్షణమాత్రమైనా వ్యర్థం చేయని పట్టుదల ఇవి దత్ ప్రధాన లక్షణాలు. ఆయన సతీమణి

నా మిత్రులు — చిత్రకారిణి లావణ్యదత్, వయస్సు నాలుగున్నర సంవత్సరాలు.



# హైదరాబాద్ నోట్ బుక్

శ్రీమతి నిర్మలదత్ సాహిత్య పట్టభద్రురాలు 1968 నుంచి చిత్రలేఖనం ప్రారంభించారు జర్మనీ దంపతులు ఫ్రాంక్, లూజాహ్యుడ్ చ్‌ల ఎద్ద మైసూరు కళా పరిషత్తు, ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడెమీ అవార్డులు పొందారు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్‌కమీషన్‌లో పని చేస్తున్నారు కుమార్తె చిరంజీవిని లావణ్యదత్ వయస్సు నాలుగున్నర యేడు "ప్రేదిరే ప్రాక్తన జన్మ విద్యా" అని కాళిదాసు అన్నట్లు చిత్ర రచన అబ్బిన పాప సుప్రసిద్ధుడైన మనోహన్‌దత్ చిత్రాలలో సాంకేతిక ఉన్నతస్థాయికి చెందినట్టిది తలిదండ్రుల ప్రభావంతో లావణ్య గొప్ప చిత్రకారిణి కాగలదన్న ఆశాభావం ఉరుదూ హాలు గలీలోని 3–6-190/2 ఇంట్లోని ఈ దంపతుల చిన్న స్టుడియోను చూచిన వారికి ఎవరికైనా కలుగుతుంది

### సరస్వతీ విద్యాపరిషత్

స్వాతంత్ర్యోద్యమ కాలం నుంచి హిందీ వ్యాప్తికి జీవితం అంకితం చేసిన మిత్రులు శ్రీ సిహెచ్ వి సుబ్రహ్మణ్యం ప్రస్తుతం వెంకటరమణ నగర్‌లో సరస్వతీ విద్యా పరిషత్తు కార్యదర్శిగా సరస్వతి విద్యామందిరం పాఠశాలను నిర్వహిస్తూ దాని భవన నిర్మాణం కోసం చేస్తున్న ప్రయత్నాలలో భాగంగా మార్చి 6 వ తేదీన గాంధీభవన్‌లో కృష్ణ పారిజాత నృత్య నాటక ప్రదర్శనం ద్వారా విరాళాలకు ప్రయత్నించడం ప్రశంసనీయం శ్రీ వెంపటి చినసత్యం కూచిపూడి అకాడెమీ నృత్యనాటికను విశ్వఖ్యాతి గన్న కుమారీమణులు శోభానాయుడు పద్మ మంజుభార్గవి, అనుపమలతో ప్రదర్శించింది శోభానాయుడు సత్యభామగా, పద్మ రుక్మిణిగా అపూర్వ చాతుర్యం చూపారు అనుపమ నారదుడుగా, మంజు భార్గవి కృష్ణుడుగా నటించారు గురుకులాల ఆదర్శాలతో ప్రారంభమైన సరస్వతీ విద్యామందిర్ గొప్ప అభివృద్ధి సాధించగలదని, దాని నిర్వాహక వర్గం బట్టి కూడా ఆశించవచ్చు నిర్వాహక వర్గం అధ్యక్షుడు జి పుల్లారెడ్డి ఉపాధ్యక్షులు డి రామస్వామి కార్యదర్శి సిహెచ్ వి సుబ్రహ్మణ్యం సంయుక్త కార్యదర్శి సి చంద్రశేఖర శాస్త్రి, కోశాధిపతి వి ఎ ఉమామహేశ్వరం.

### పసిఫిక్ మారుమూల ప్రజల కళ

మానవుడు ఎవరికీ సంబంధంలేక మారుమూలలోవున్నా, తన కళా తృష్ణను కోల్పోడు అందుబాటులోవున్నవాటితోనే తన భావాన్ని కళాత్మకంగా అభివ్యక్తం చేస్తాడు అనడానికి మార్చి 16 నుంచి 21 వరకు కళాభవన్‌లో జరిగిన ఓషియానియా కళాప్రదర్శనం నిదర్శనం పసిఫిక్ మహాసముద్రంలో దక్షిణాన మారుమూల చిన్నచిన్న దీవులలో 25 వేల సంవత్సరాలకు ముందునుంచే నివసిస్తున్న ప్రజలు లోహంగాని, మృణ్మయ పాత్రలుగాని కొన్నిచోట్లరాయిగానితెలియని ప్రజలు కర్రతో, జలజంతువులఎముకలతో రాతిసాధనాలతో మలచిన కళా ఖండాలను చూచినప్పుడు ఎవరైనాఆశ్చర్యపడతారు ఓషియానియా ప్రాంతాన్ని సంస్కృతినిబట్టిమూడు ప్రాంతాలుగా విభజించారు శాస్త్రజ్ఞులు. (1)న్యూగినీ,మెలేషియా ఇది పశ్చిమ ఇరిన్ నుంచి న్యూకెలెడోనియా వరకు (2) మైక్రోనేసియా, ఇది పలావూ నుంచి గిల్బర్ట్స్‌వరకు (3) పాలినీషియా ఇది తూర్పు పడమరలుగా ఫిజీ నుంచి ఈస్టర్ ద్వీపంవరకు, ఉత్తరదక్షిణంగా హవాయీనుంచి న్యూజిలాండ్ వరకు చేపల పండ్లరంపాలలో, రాక్షసి ఆలిచిప్పలతో వజ్రం గులు చేసిన వస్తువులు, నాగలి, అరకలేని కందమూల ఫలాల వ్యవసాయానికి తగిన పనిముట్లు ఆలిచిప్పలు, టెంకాయచిప్పలు, అరటిచెట్లవస్తువులు ఒక్కటేమిటి నిత్యజీవితంలో కళనురంగరించుకున్న ఈ మానవ సంఘాన్ని మనం కొనియాడక తప్పదు. ఇతని దేవతామూర్తులు, ఇతని విశ్వాసాలకు ప్రతినిధులు. ఈ సంచార ప్రదర్శనాన్ని నిర్వహిస్తున్న యునెస్కోవారిని, కేంద్ర ప్రభుత్వం విద్యాశాఖను ప్రశంసించక తప్పదు



పొలినీషియాలోని దేవీమూర్తి

### ఆపగింజపై వెంగళరావు

సపోటాగింజల మీద, ఆపగింజల మీద రంగు బొమ్మలు గీచడం యువచిత్ర కారుడు శ్రీ గేదెల అప్పారావు సరదా. వయస్సు 24 సంవత్సరాలు కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా అల్లూరుగ్రామం జన్మస్థలం. డ్రాయింగు ఉన్నత పరీక్షలలో ఉత్తీర్ణుడయ్యాడు. మితభాషి. ఆపగింజమీద ముఖ్యమంత్రి వెంగళరావును,సపోటాగింజమీద ఇందిరాగాంధిని దించారు చిన్ననాడు సపోటా తోటలలో పెరిగాడు కనుక సపోటా ఆయన జీవితంలోను, కళలోను చోటుచేసుకుందేమో! ఈ చిత్ర బీజాలను చిన్న ఉంగరాలలో బిగించటం సులోక కళ అనే చెప్పాలి ఇలాటియువకుని ప్రోత్సాహించడం, శాశ్వతమైన జీవికఏర్పాటు చేయడం, తద్వారా ఆయన సేవను జాతికి వినియోగపడేట్టుచేయడం ప్రభుత్వం చేయవలసినపని

### ఉప్ర శలి

"ఏమ్సార్ ! దాదాపు అర్ధశతాబ్దిగా ఉంటున్నారుగదా ఎక్కడేసిన గొంగడి అక్కడేలాగ వుందే మీ జీవితం!" అన్నాను ఒక సుమారయిన నాయకునితో. "మీకు తెలియందేముంది ? మనను పైకి చేదుకొనే మల్లయ్యలు, కోటప్పలువుండాలి గదా ?" అన్నారు ఆయన

— తిరుమల రామచంద్ర

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street.

అప్పుడు రాత్రి తొమ్మిది దాటింది

సుబ్బరామయ్య ఇంట్లో ఎవరూ నిద్రపోయి నట్లు లేదు తలుపులన్నీ తెరిచే ఉన్నయ్

ఆవరణ గేటు తెరుచుకొని మెల్లగా లోపలికి వచ్చి — తన గదిలోకి వెళ్ళి లైటు వేసి మంచంమీద వెల్లకిలా పడుకుండిపోయాడు విశ్వం

అతని గదిలో లైటు వెలగటం చూసే గామలు లోపలినుంచీ సుజాత వచ్చింది

''ఇంతసేపు ఎక్కడికి వెళ్ళారు ?''

పడుకున్నవాడల్లా టక్కున లేచాడు అయినా ఆమెకు ఏమని సమాధానం చెప్పాలో తోచలేదు విశ్వానికి

''లేచి భోజనానికి రండి అందరూ తినే శారు మీకోసమె ఎదురు చూస్తున్నాను'' — చెప్పి అతడి సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయింది సుజాత

ఆమె మరికొద్దిసేపు అక్కడ నిలబడి ఉంటే బాగుండు ననిపించింది విశ్వానికి రమేష్ అభిప్రాయాలు, లతడితోసుధస్నేహంఅన్నీ సుజాతకుచెప్పి తన మనోభారం వదుల్చుకుందామన ఆశపడ్డాడుమరి

*13*

అప్పుడు రాత్రి ఎంతైందో తెలియదు

తన గది తలుపులమీద టక్కు టక్కున ఎవరో కొడుతున్న శబ్దం విని విశ్వం దిగ్గున లేచాడు వచ్చింది ఎవరైయుంటారు ? అని ఆలోచించు కొంటూనే వెళ్ళి తలుపు తీశాడు ఆ నిద్రమత్తులో లైట్ స్విచ్ ఆన్ చేయటమే మరిచిపోయాడు

ఒక యువతి ! ఆమె సుజాతో, సుమో తెలియకముందే అతడి చేతిలో ఒక కాగితం మడతపెట్టి వెంటనే లోపలికి వెళ్ళి చటుక్కున తలుపు వేసేసుకొంది

లైటు వేసి, విషయం ఏమిటో తెలుసుకోవాలన్న ఆత్రంకొద్దీ అక్కడే నిలబడి ఆ కాగితం మడత విప్పాడు

''విశ్వంగారికి,

మీరు నాకు చాలా నచ్చారు మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను ఈ విషయం ఎప్పటికప్పుడు మీకు తెలియచెప్పాలని విశ్వప్రయత్నం చేస్తున్నాను అయితే మీముందుకు వచ్చాక నా మనసులో మాటను ఎలా చెప్పాలో — ఏమని చెప్పాలో తెలియక చాలా యిబ్బందిపడుతున్నాను నాముఖంలో ఫీలింగ్స్‌ను బట్టి మీరా సంగతి గమనించేవుంటారు

సుజాతపై మీలో జాలే తప్ప ప్రేమ లేదన్నది నా గట్టినమ్మకం నాకూ అక్కపై సానుభూతి వుందనుకోండి దాన్ని చేసుకొని మానసికంగా జీవితాంతం కృంగిపోవటానికి మీరు అంగీకరించరని నాకు తెలుసు అందుకే మీమీద ఆశలు పెంచుకున్నాను జీవితంలో పెళ్ళంటూ చేసుకొంటే మిమ్మల్నే సమయం వచ్చినప్పుడు నాన్నగారికి స్పష్టంచేస్తాను ఈ విషయాన్ని 'సుజాతకోసమని వచ్చి సుమను ప్రేమించటమేమిటి ? దీనివల్ల ఎన్ని అనర్థాలు కలుగుతాయో ?' అని సందేహించకండి కేవలం నన్ను గురించయినా నా తల్లిదండ్రులు మిమ్మల్ని క్షమించి వదిలేస్తారు ఒకవేళ

## కాలమిచ్చిన తీర్పు

( 30వ పేజీ తరువాయి)

వాళ్ళు మన ప్రేమను అంగీకరించకపోతే మన దారి చూసుకొని మనం పోదాం

మీ సమాధానంకోసమే నిరీక్షించే,

మీ, సుమ''

''ఎంత తెగింపు చేసింది సుమ !'' ఆ ఉత్తరం చదివాక మనసంతా మొద్దుబారినట్లయింది విశ్వానికి

ఆ కాగితాన్ని తిరిగి మడతపెట్టి జేబులో దోపుకొంటూండగా — వరండాలో లైటు వెలిగింది సుబ్బరామయ్య తన గదివైపు రావటం కనిపించింది

ఆయన్ని చూసి అవాక్కయిపోయాడు విశ్వం

''ఇంతకుముందు సుమ నీ గదికి వచ్చింది కదూ ? మీ యిద్దరిమధ్య ఎంతకాలంగా నడుస్తోంది గ్రంధం ?''

సుబ్బరామయ్య అలా అడగటంతో ఆయన ముందే తల బద్దలుకొట్టుకొని చావాలనిపించింది విశ్వానికి అయినా మనసును ఉగ్గబట్టుకొని తన జేబులో వున్న ఉత్తరాన్ని తీసి ఆయన చేతిలో పెట్టాడు

ఆ ఉత్తరాన్ని చదివాక అనుమానం కొంతవరకు తీరిపోయినా —

''ఇందుకు ఏమిటి నీ సమాధానం ?'' కరకుగానే అడిగాడు సుబ్బరామయ్య

''సర్! నేను నమ్మకద్రోహినికాను అదొక్కటి గుర్తుంచుకొంటే చాలు మీరు'' ఆ మాట చెబుతూ కన్నీటిపర్యంతమైయ్యాడు విశ్వం

''మరి పరిస్థితిని యింతవరకు ఎందుకు రానిచ్చావ్ ?''

''ఇలా జరుగుతుందని నేను ముందు ఊహించుకోలేదు అందరితో సోషల్‌గా మాట్లాడటం నాకు చిన్నప్పట్నుంచీ అలవాటు అలాగే సుమతో మాట్లాడాను అయితే ఆమె నన్ను పెడగా అర్థంచేసుకొంది ఏదేమైనా — యికముందు మాత్రం నా జాగ్రత్తలో నేనుంటాను సర్''



''సరే నిన్ను నేను యిప్పటికీ నమ్ముతున్నాను విశ్వం ! యిప్పుడు అది రాసిన ఉత్తరానికి నువ్వే జవాబు రాయి నేను మందలించటం బాగుండదు ఏదైనా నీ మనసులో మాటను కుండ బద్దలు కొట్టినట్లు దానికి చెప్పేయ్ నీ ఉత్తరానికి అది తాత్కాలికంగ బాధపడ్డా తర్వాత తనంతట తానే గుండె రాయి చేసుకొంటుంది''

''అలాగే సర్''

విశ్వం వైపు కృతజ్ఞతగా చూసి వెళ్ళపోయాడు సుబ్బరామయ్య

జరుగుతున్న విచిత్ర సంఘటనలను గురించి పదే పదే ఆలోచిస్తూ పడుకున్నాడు విశ్వం

ఆ రాత్రి సుబ్బరామయ్యకు చెప్పినట్లే మర్నాడు తన మనసేమిటో సుమకు తెలియచేసేశాడు అతడు

[ ఇంకా ఉంది ]

